ఓం

# శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశికేంద్రుల వారి శతవార్షికారాధన సంచిక

# Centenary Celebration Souvenir

తేది 07, 08 ఫిబ్రవరి, 2013



కార్యాచరణ కార్యవర్గ కమిటి

## శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక అచలగురు మందిరం

సీతాఫల్‌మండి, సికింద్రాబాద్

ఓం

శ్రీ సద్గురువేనమః

శ్రీ మద్రామడుగు శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయము

# శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణ దేశిక ప్రభువుల వారి

# శతవార్షికారాధన సంచిక



ప్రకాశకులు

**శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక అచలగురుమందిరం**

**సీతాఫల్‌మండి - సికింద్రాబాదు 500 061**

www.feelkhanalaxmanaguru.com E-mail : feelkhana.laxmanaguru@gmail.com

# శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణ దేశిక ప్రభువుల వారి శతవార్షికారాధన సంచిక

ప్రథమ ముద్రణ :

నందననామ సం॥ర పుష్య బహుళ ద్వాదశి
గురువారం తేది 07-02-2013

ప్రతులు : 3000



వెల : రూ॥ 50-00

ప్రకాశకులు :

శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక అచల గురు మందిరము
సీతాఫల్ మండి, సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ నెం. 27505032.
www.feelkhanalaxmanaguru.com
E-mail : feelkhana.laxmanaguru@gmail.com

## సావనీర్ సంపాదక వర్గము

1. అ॥ప॥శ్రీ సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి
2. అ॥ప॥శ్రీ దయానంద సావంత్ సీతారామారావు
3. అ॥ప॥శ్రీ ప్రజ్ఞాన విలక్షణ భీంపెల్లి గోపాల్‌బాబు
4. అ॥ప॥శ్రీ వేదాతీత తీరందాసు ఆంజనేయులు
5. అ॥ప॥శ్రీ నిర్గుణానంద కోడి అమృత రావు

## కార్యనిర్వాహణ వర్గము

1. అధ్యక్షులు : అ॥ప॥శ్రీ సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి
2. ఉపాధ్యక్షులు : అ॥ప॥శ్రీ నిర్మలానంద దొంతికామేశ్వర రావు
3. ఉపాధ్యక్షులు : అ॥ప॥శ్రీ సమరస నిర్మల నిర్భయానంద పల్లెల నర్సింహ్మ రావు
4. ఉపాధ్యక్షులు : అ॥ప॥శ్రీ సమరసానంద చిటుగోరులక్ష్మణ రావు
5. కార్యదర్శి : అ॥ప॥శ్రీ దయానంద సావంత్ సీతారామారావు
6. సహాయకార్యదర్శి : అ॥ప॥శ్రీ నిర్గుణానంద కోడి అమృత రావు
7. కోశాధికారి : అ॥ప॥శ్రీ వేదాతీత తీరందాసు ఆంజనేయులు
8. సహాయకోశాధికారి : అ॥ప॥శ్రీ నిర్మలానంద బొట్ల మోహన్ రావు

## కార్యవర్గ సభ్యులు

1. శ్రీ జ్ఞానానంద కూరసత్తయ్య
2. శ్రీ జ్ఞానానంద ఎం. జగన్నాధం
3. శ్రీ త్యాగానంద వరంగంటి భాస్కర్
4. శ్రీ వివేకానంద కొండోజు రామదాసు
5. శ్రీ జ్ఞానానంద ఎం. రఘునాథ్
6. శ్రీ నిర్మలానంద అతీత ఎం. రాజారావు
7. శ్రీ అచలానంద బోగరాజు నర్సింహ్మ
8. శ్రీ బోధానంద వర్కూర్ వెంకటేశం
9. శ్రీ వడ్ల ఈశ్వరాచారి
10. శ్రీ జ్ఞానానంద దూదంబలరాం
11. శ్రీ మేకల సాయిరాం
12. శ్రీ దయానంద జి. రాములు యాదవ్
13. శ్రీ దయానంద ఎన్. రాజేశ్వర్
14. కరుణానంద చదురుపల్లి కృష్ణ
15. అమృతానంద బి. నాగేంద్ర
16. శ్రీ యన్. సురేష్ కుమార్
17. అచలానంద బంగారు నర్సింగరావు
18. తీరందాసు మురళీకృష్ణ మూర్తి
19. కరానంద పిన్నంశెట్టికిషన్
20. జి. రామచందర్

# విషయ సూచిక



# మందిర సింహావలోకనము



శ్రీధర స్వాముల వారి ప్రియశిష్యులు శ్రీమద్బృహద్వాసిష్ఠ శిద్ధాంత నిర్ధారణోద్ధారకులును శ్రీమదచల బోధ ప్రతిష్ఠాపనాచార్యులును నగు శ్రీమద్రామదుగు శ్రీశివరామదీక్షితులవారు శ్రీ శివరామదీక్షితులవారి గురువు శ్రీధరులు పండరిపురవాసి. ఆయన శా.శ. 1651 సౌమ్యనామ సం॥ మాఘ బ॥ విదియ ఆదివారము సరియగు తేది. 25-1-1730. రోజున సమాధి చెందినట్లు శాసానాధారము వెల్లడించుచున్నది. శ్రీధరులు శ్రీశివరామ దీక్షితులకు దీక్ష ఇచ్చిన 21 రోజులకు దేహము చాలించారు. శ్రీ శివరామదీక్షితుల వారు విరోధికృత్ కార్తీక శు॥ దశమి శనివారము రోజున దేహము చాలించినారు. దీనికి సరియగు తేది శా.శ. 1713 క్రీ.శ. 1791 నవంబర్ 23వ తేదిగా గుర్తించబడినది. ఆయన జీవిత కాలము క్రీ.శ. 1690-1791 అనగా 101 సం॥ పూర్ణపురుషాయుస్సులు ఇది దక్కన్‌లో కుతుబ్‌షాహిల గోలుకొండ సామ్రాజ్యము కూలిపోయి అసఫ్జహి నిజాముల ఏలుబడిలోనికి వచ్చిన కాలము. ఇతడు నల్లగొండజిల్లా సమస్తానం నారాయణ పురం వాసులు. వారి ఇంటిపేరు రామదుగు, గోత్రము హరితస, తల్లిదండ్రులు నిర్మలాంబ విశ్వనాధశాస్త్రులనే తెలంగాణ వైదిక బ్రాహ్మణులు. వీరు శివపూజ ధురంధరుడు, వేదవేదాంగ పారంగతుడు. తర్కవ్యాకరణ మీమాంస వేదాంత శాస్త్రవిధుడు, శతక్రతుయాజి, నిత్యాగ్నిహోత్రి, అట్టి వీరికి వేదాంత మీ మాంసయనె ఔషధము కొరకు, జనన మరణ దుఃఖ నివృత్తి చేయగల సద్గురుని అన్వేషణ యందు అనేక ప్రాంతములలో అనేక మతాచార్యుల కలిసి తన సందేహమునకు సమాధానము నడగవారి మాటలకు తృప్తి నొందక, అటుపై కాశీలో జరుగు సాధు సమ్మేళనములో పాల్గొని వారి చర్చలువిని అందు సరిపడక పలు ప్రాంతాలలో నున్న పుణ్యక్షేత్రములు తిరుగుచూ చివరకు పుండరీపుర నివాసులైన శ్రీధరుల వారిని దర్శించి వారి కృపకు పాత్రులైరి. వీరు బృహద్వాసిష్ఠంబను అచలబోధసిద్ధాంత గ్రంథంబను "శ్రీశివరామదీక్షితీయము" రచించి సకల భక్తశ్రేణులకు అట్టదుగువర్గ జనావళికి సులభముగా తెలియుటకు వచన కావ్యము నాటి సామాన్య తెలుగు భాషలో వెల్లడిచేసిరి. వీరి ఆజ్ఞానుసారము వీరి ముఖ్యశిష్యా గ్రగణ్యులైన శ్రీమత్కాంబాలూరి అప్పయమంత్రి, రాయచూరు రామలింగారాధ్యులు, శ్రీ అమలావతీశ్వరులు, శ్రీ వల్లూరి రామకృష్ణయ్య, శ్రీ స్వప్రకాశభాస్కర్ యోగీశ్వరులు యీ అచల బోధను నలుదెసలకు వ్యాపింపజేసిరి. అందు శ్రీ కంభాలూరి అప్పయ్యమంత్రి శిష్యులైన శ్రీమత్పరశురామ సీతారామస్వామి, పరుశురామనరసింహదాసు గారలు వీరిలో పరుశురామనరసింహదాసుగారు భద్రాద్రిరామశతకము, పరశురామ సీతారామశతకము, వైద్యశాస్త్రము, పరమతత్త్వములు శ్రీశివరామ దీక్షిత చూర్ణిక రచించిరి. శ్రీ నరసింహదాసుగారు నళ నామ సం॥ ఆశ్వీయుజ శు॥ సప్తమి రోజున పరమపదించిరి. వీరి జీవిత కాలము. క్రీ.శ. 1780-1856 = 76 సం॥లు శ్రీ పరశురామ సీతారామస్వామి జీవితకాలము క్రీ.శ. 1782-1854=72 సం॥లు జీవించిరి. శ్రీ ఆనందనామ సం॥ శ్రావణ బ॥ అమావాస్యలో బట్టబయలైరి. వీరి శిష్యులైన శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు నల్లగొండజిల్లా ఆలేరు సమీప కొలనుపాక గ్రామము. వీరి గోత్రము భారద్వాజస. ఇంటిపేరు భాగవతులవారు. తల్లి జానకమ్మ తండ్రి నారాయణయోగి. వైదీక బ్రాహ్మణులు, భార్య అనంతలక్ష్మి వీరు యుక్త వయస్సులోనె తల్లిదండ్రులను, సోదరీ సోదరుల నల్గురునీ, భార్య పుత్రులును పోగొట్టుకొని ఏకాకియై జీవితమున విరక్తి పొంది జనన మరణములకు మూలము ఏమిటని ప్రయత్నించగా వీరికి పరశురామ సీతారామస్వామి అనుగ్రహము కలిగినది. వీరు ఆధ్యాత్మలల్లి అఖిలదేవతాస్తుతి కీర్తనలను రచించియుండిరి. ప్రథమమున వీరు రామభక్తులు. ఇతడు హరికథలుగానము చేసేవారు. సకల వేదవేదాంగ శాస్త్ర పారంగతుడు. వీరు గురుకృప వడసిన తదనంతరము స్వగ్రామము విడచి హైదరాబాద్ రాజధానికి తరలివచ్చిరి. అక్కడక్కడ దేవాలయముల ప్రాంగణములలో విడిది చేసి హరికథలు చెప్పుకుంటూ అందు తన గురుబోధ విశిష్ఠతను కూడ పొందుపరిచి తెలియజేయచుండగా అనేకులు అందుకు ఆకర్షితులై వారిని అనుసరించి వారి అనుగ్రహమును పొందిరి. వీరిలో

జాలమాంబగారు, ఫీల్కాణ లక్ష్మణ, శంకరరావు గారలు, ఆదిరాజు తిరుమల రామశర్మ, ఆంధ్రపెద్దివెంకటరెడ్డి, సాధూరాం బహద్దూర్, మంగోలు వెంకటనర్సయాచారి మొదలగువారు ముఖ్యులు. వీరి పెదమహరాజ్‌గంజ్ నివాసులైన శ్రీజాలమాంబ గారి గృహమున వుంటూ ప్రతిదినము గురునిపేరు వచింపుచు పురము దిరిగి సాహిత్యమును తెచ్చుకొని, జీవితము వెల్లబుచ్చిరి. అక్కడ జాలమాంబ గారి సేవలకు, భక్తికి పరవశుడై భక్తురాలి కోరికె మేరకు తనగురు బోధను అనుభవమును జోడించి శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థము అను గ్రంథమును మరియు వేదవేదాంతీత ద్వైతా ద్వైతరహిత పరమతత్వమనందగు "శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థనేక సద్భృష్టాంతప్రకాశిక" అను మరియొక పూర్ణ గ్రంథము వ్రాసిరి. అట్టి గ్రంథము వారి అంత్యకాలములో శ్రీమంగోలు వెంటక నర్సయాచారికి ఇచ్చి వుండిరి. శుద్ధ నిర్గుణ తత్వకందార్థముల కందపద్యముల గ్రంథము శ్రీ ఫీల్కాణ లక్ష్మణదేశికుల వారికి అందజేసిరి. అట్టి గ్రంథము బేగంపేట మందిర వివాదములలో కొందరు తస్కరించి దక్కించుకొనిరి. మూడవదగు వ్రాతప్రతిలో జాలమాంబ గారికి చేసిన ద్వాదశ బోధల పద్యకావ్యము, 21600 హంసల వివరణ పట్టిక, భగవద్గీతపై వాక్యానము "సారాంశ జ్ఞానము" వేదాంత వార్తికము కలిగినవి శ్రీ ఫీల్ఖాణ శంకరరావు గారలకు అందజేసిరి. వీరి యొక్క కృషి అమోఘము వీరు అచల సాంప్రధ్ధాయమునకు చేసిన సేవ మరువరానిది. వీరు రచించిన రచనలలో వాడిన పదములకు అర్ధములు తెలియుటకు నిఘంటు గ్రంథము "ఆంధ్రనామసంగ్రహము" రచయిత శ్రీపైడిపాటి ఏకాంబరమంత్రివారని గ్రంథ ఆరంభములో తెలిపినారు. కనుక వారు ఎంతటి పండితులో మనకు తెలియుచున్నది. వీరు స్వస్తిశ్రీ ధాతనామ సం॥ కార్తీక శు॥ దశమి శుక్రవారము తేది 27-10-1876 బయలులో బైలైరి. వీరి శిష్యులు శ్రీమత్ ఫీల్కాణ లక్ష్మణరావు గారు పరాభవ నామ సం॥ శ్రావణ బ॥ ద్వాదశి మంగళవారము రోజున శ్రీవత్స గోత్రమునందు ఫీల్ఖాణవంశంబున నరసింహ్మారావు రామాంబ దంపతులకు జనించిరి. వీరు నియోగి బ్రాహ్మణులు. ప్రథమమున వీరు సిద్దేశ్వరులనే గురువుల సేవజేసి "పంచాక్షరి మంత్రముద్రయోగాదుల" నను గ్రహింపబడి, తదుపరి వయసు 30 సం॥ల తరువాత సుకృత విశేషము చేత అచలగురుడగు శ్రీమద్భాగవత కృష్ణదేశిక స్వాముల కృపవడసి పరిపూర్ణబోధను పొందిరి. వీరు ఆ జన్మ బ్రహ్మచారులు. వీరు సికింద్రాబాద్ సమీప బేగంపేట గ్రామములో తన స్వగృహమును గురుమందిరముగా నేర్పాటు చేసి ప్రతి సం॥ కార్తీక శు॥ దశమి రోజున గురుదేవులైన శ్రీమద్భాగవత కృష్ణదేశికుల ఆరాధన చేయుచుండిరి. వీరు రచించిన గ్రంథములు సుబోధ రత్నాకరము. అచలతత్వశిరోమణి అఖండమాల - సుజ్ఞానాతీతార్థ తత్వఖండమాల అనుగ్రంథమును అనేక అచల తత్వకీర్తనలను కృతించి 68వ ప్రాయమున ప్రమాధి నామ సం॥ పుష్య బ॥ ఏకాదశి గురువారము రోజున రాత్రి 10 గం॥లకు బేగంపేట స్వగృహమునందు విదేహ కైవల్యమును జెందిరి క్రీ. శ. 1-2-1913.

వీరు జీవించి వుండగా తన ఆస్తిపై ఎవరికి హక్కులేదు. గురుదేవుని పేర మందిరముగా నెలకొల్పి శిష్యులకు గురుస్థానముగా కల్పించిరి. అటుపై శిష్యులు ప్రతి సం॥ పుష్యబ ॥ ద్వాదశి గురువుగారి ఆరాధనలు చేయుచువచ్చిరి. తరువాత కొంతకాలమునకు మందిరము శిధిలమునకు వచ్చినందున ముఖ్య శిష్యులకొందరు శ్రీమోటుకారు తిప్పన్న, గుటాల వీరన్న, బంగ్లా బాలయ్య రేణింతల లింగయ్య, పసుపులేటి రామస్వామినాయుడు, మరియు 17 గురు భక్తుల ద్రవ్య సహాయముచే పై మందిరము పునరుద్ధరించి అందు ధర్మశాల, వంటశాల తోట మో॥ తేది. 20-9-1930 నుండి 12-12-1934 వరకు పూర్తిచేసిరి. ఆకాలములో ఖర్చు చేసిన మొత్తము రూ॥ 3236 - అణా-10 పైసలు, 11. ఇది ప్రజల సొమ్ము కాదు. అటుపై వీరి శిష్యవర్గము ఒక కమిటీగా ఏర్పరచుకొని. ది.వి. 3-2-1935 భావనామ సం॥ పుష్య బ॥ ఆదివారము అమావాస్య రోజున ఏర్పాటు చేసుకొని అందు ఈ సంఘమునకు మునుముందు కూడా శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణదేశికులవారి శిష్యులు వారి పారంపర్య శిష్యులు సుగుణులైన సాంఘీకులుగా చేరవచ్చును కాని ఇతరులు చేరజాలరు అని వ్రాసి పెట్టి, ఇది ఎట్టి పరిస్థితులలోనైన ఎవరిచేతనైన మార్చరాదని అందరు తీర్మానించి సంతకములు చేసిన కాఫీ మందిరమున వున్నది. కాన పాఠకులు పై విషయములు గ్రహించగలరని మనవి చేయుచున్నాము.

ఇట్లు

కార్యదర్శి
శ్రీ దయానంద సావంత్ సీతారామారావు B.E. (Mech)

అధ్యక్షులు
సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి B.Com

కార్యవర్గ కమిటీ



# శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణ దేశికులు (1846-1913)

రామడుగు శివరామదీక్షితులు ఆంధ్రప్రదేశంలో స్థాపించిన అచలమతం అచిర కాలంలో మూడుపూవులారు కాయలుగా వర్ధిల్లినది. దీక్షితుల తరువాత ఆయన శిష్యుడు కర్నూలు జిల్లా కంబాలూరి అప్పమంత్రి, ఆయన శిష్యులు ఎఱ్ఱగొండ పాలెం పరుశురామ సీతారామస్వామి పరశురామ నరసింహస్వామి సోదరులు (కౌండిన్యస గోత్రం) వారి శిష్యుడు భాగవతులకృష్ణప్రభువు (1813-1876) అచలమతాన్ని బహుళ వ్యాప్తి చేసినారు. ఆ మతానికి కావలసిన భక్తివేదాంతవాఙ్మయం సృష్టించినారు. భాగవతుల కృష్ణప్రభువు గొప్ప హరిదాసు సహజకవి. తమ కవితాకళద్వారా అచల మతానికి ప్రకరణ గ్రంథములనదగిన రచనలు చేసినారు. భాగవతులకృష్ణ ప్రభువు వద్ద దీక్షితులైన శిష్యులు పెక్కురు. వారిలో హైదరాబాదు సికిందరాబాదు నగరాల్లో అచల మతానికి గొప్పపట్టు సంపాదించినవారు పీల్ఖానా ఇంటి పేరు గల శ్రీవత్సగోత్రీకులైన నరసింహారావు. సికింద్రాబాదు బేగంపేట కరణం. ఆయన భార్య రామమ్మ. వీరు శాక్తేయులు. వీరి తొలి ఇంటిపేరు కొత్తపేట వారు. హైదరాబాదులో మొదట పీల్ఖానాలో ఉండి తరువాత బేగంపేటకు మారటం చేత పీల్ఖానా ఇంటి పేరైనది. సంపన్నులైన ఈ నియోగి దంపతుల సంతానం లక్ష్మణరావు, గిరెమ్మ, రాధమ్మ, శంకరరావు, రామారావులు ఇందులో జ్యేష్ఠులైన లక్ష్మణరావు మన కథనాయకులు. లక్ష్మణరావు జననం శా. శ౧౭౬౮ పరాభవ సం॥ శ్రావణ బహుళ ద్వాదశి మంగళవారం క్రీ.శ. 18-8-1846.

లక్ష్మణరావు గారు లౌకిక పారలౌకికవిద్యల పారమందిన పండితుడు. సత్త్వ సంపన్నుడు. ఆయన మిగతా తోబుట్టువులకంటె విలక్షణమైన వాడు, ఆ జన్మబ్రహ్మచారి శంకరరావు గృహస్థు, అన్నగారి వలె ఆధ్యాత్మికచింతన గలవాడు. కనుక ఇరువురన్నదమ్ములు తండ్రిగారి కరణీకం బాధ్యతను చిన్నతమ్ముడు రామారావుకు అప్పగించి ఆధ్యాత్మప్రచారానికి నడుంకట్టినారు. శంకరరావు హైదరాబాద్ ఫీల్ఖానా (నాంపల్లి)లో ఉండేవాడు. లక్ష్మణరావు చిన్నతమ్ముడు రామారావుతో బేగంపేటలో ఉండేవాడు.

లక్ష్మణరావు శంకరావు సోదరులు తొలుత సిద్ధేశ్వర గురువులను ఆశ్రయించి పంచాక్షరీ మంత్రదీక్షితులై మంత్రసిద్ధి పొందినారు. అటు తరువాత అచలమార్గ ప్రవర్తకులైన భాగవతుల కృష్ణప్రభువును ఆశ్రయించినారు. ఆకాలంలో కృష్ణదేశికులు హైద్రాబాదు నగరం మహారాజ్ గంజ్‌లో తల్లావఝుల జాలమ్మ ఇంట్లో ఉండేవారు. కృష్ణదేశికులు ముందుగా జాలమాంబకు దీక్ష ఇచ్చినారు. అటుతరువాత ఫీల్ఖానా లక్ష్మణ రావు, శంకరరావు సోదరులకు, బాగ్ అంబర్‌పేట మంగోలు వెంకటనర్సయా చారికి దీక్ష ఇచ్చినారు. లక్ష్మణరావు శంకరరావు సోదరులు కృష్ణదేశికులకు చతుర్విధ శుశ్రూషలు చేసి వారి అనుగ్రహానికి పాత్రులై గురుత్వాధికారం పొందినారు. యోగారూఢులైన ఆ ఇరువురు సోదరులకు అనేకసిద్ధు లలవడినవి. కాని శంకరరావుగారి వలె లక్ష్మణరావు మహిమలు ప్రదర్శించలేదు. తమ్మునిగూడ మహిమలు ప్రదర్శించవద్దని హితముపదేశించినారు. శంకరరావుగారికి వలె లక్ష్మణదేశికుల శిష్యవర్గం బహుళకం.

అందులో ముఖ్యులు 1. దీక్షిత్ తులారాం ప్రసాద్ 2, పగడాల వెంకటేశ్వర సచ్చిదానంద స్వామి (చిత్తూరు) 3. కాగితాల గూడెం రామన్న, 4. ఇబ్రహీంపట్నం వెంకన్న, 5, గూటాల వీరన్న, 6. సింగంచెట్టి చినరామలింగం, 7. తాడ్వాయి భద్రంరాజు, 8. కిషన్‌రావు, 9. తాడ్వాయి నిమిషకవి రాజారాం, 10. కుచ్చుల వెంకటస్వామి నాయుడు, 11. పసుపులేటి రామస్వామినాయుడు, 12. బి.రుద్రమూర్తి నాయుడు, 13. కుంకుమ మల్లయ్య, 14. కొండోజు సీతయార్య, 15. సూర్యాపేట కొమరగిరి లక్ష్మీనారాయణ ప్రభువు. 16. బంగ్లా బాలయ్య వంటి ప్రముఖులు 50 మందికి పైన శ్రీవారి వద్ద దీక్షలు తీసుకున్నారు. లక్ష్మణప్రభువుల గురుభక్తి ఎంత గొప్పదో వారి శిష్యవాత్సల్యం అంత గొప్పది. లక్ష్మణ ప్రభువులే మొదటిసారి శివరామ దీక్షితుల అచలగురు మందిరం అటు తరువాత తమ గురువులు భాగవతుల కృష్ణప్రభువుల సమాధి మందిరం బేగంపేటలో నిర్మించినారు. తమకంటె ముందే దేహం చాలించిన తమ్ముడు శంకరప్రభువుల సమాధి మందిరం కూడ బేగంపేటలో నిలిపినారు. లక్ష్మణ ప్రభువులు శా. శ ౧౮౩౫ ప్రమాదీచ సం॥ పుష్యబహుళ ఏకాదశి గురువారం రాత్రి 10 గంటలకు (22-1-1913) విదేహకైవల్యం పొందినారు. వారి శిష్యులు శ్రీవారి సమాధిమందిరాన్ని వారి గురువుల సమాధి వద్ద నిలిపినారు. కాలాంతరాన బేగంపేట విమానాశ్రయ నిర్మాణ సమయంలో ఈ సమాధులన్నీ నేలమట్టమైనవి. ప్రభుత్వం వారు బేగంపేటలోని ఆ స్థలాలకిచ్చిన నష్టపరిహారం ధనంతో వారి శిష్యులు సీతాఫల్‌మండీలో స్థలం కొని శ్రీమత్ ఫీల్ఖానా లక్ష్మణదేశిక ప్రభువుల అచల గురుమందిరం ఏర్పాటు చేసినారు. ప్రస్తుతం దీని అధ్యక్షులు ఉప్పలంచి కృష్ణమూర్తి గారు.

లక్ష్మణదేశికుల రచనలు 1. సుబోధరత్నాకరము, 2. అచలతత్త్వశిరోమణి అఖండమాల, 3. సుజ్ఞానాతీతార్థ తత్త్వఖండమాల, లక్ష్మణదేశికుల నిర్యాణానంతరం వారి తమ్ముడు రామారావు ప్రేరణతో శ్రీవారి రచనలు చీకోటి వీరన్న అండ్ సన్స్ సుబోధ ముద్రాక్షర శాలలో 1914 ఆగష్టులో మొదటిసారి అచ్చైనవి.

లక్ష్మణదేశికులు తొలుత పంచాక్షరీ మంత్రసిద్ధులై అటు తరువాత అచల మార్గాను యాయులైనారనుటకు వారు రచించిన

**ఈ తత్త్వము సాక్ష్యము.**

ఓం నమశ్శివాయ యను మంత్రము ఒప్పదగినదే ఓ మనసా
కానలేక ఈ మానవవాధములు కల్లని పల్కిరే ఓ మనసా ॥ ఓం ॥
జ్ఞానము గలవారలు ఈ మంత్రము ఘనమని యెన్నిరె ఓ మనసా
ప్రాణపదంబగు శివపంచాక్షరి పఠనశాయవే ఓ మనసా ॥ ఓం ॥
బొమల మధ్యమున వెలిగెటి కళలను క్రమముతొ నెరుగవె ఓ మనసా
కమలభవుడు ఇంద్రాదిమౌనులును కడతేరినరట ఓ మనసా ॥ ఓం ॥
తపసులు యోగులు పరమహంసలును జపవ్రతములు సల్పిరె మనసా
చపలతలుడిగియు శ్రీ గురువర్యుని చెంత జేరవే ఓ మనసా ॥ ఓం ॥
ప్రథమ గురుడు సిద్ధేశ్వరుడను వారుపమచే బోధించిరె మనసా
వ్యథలు లేని ఆనందవార్ధిలో సతతము గ్రుంకితి ఓ మనసా ॥ ఓం ॥
కారణరూపము దాల్చిన వారలు భాగవతుల కృష్ణుడె మనసా
నేరములెన్నక ధారుణిలో మన కోరిక లీడెర్చునె ఓ మనసా ॥ ఓం ॥
ద్వాదశి శోడషి ద్వయమంత్రంబులు బోధపరచెనే ఓ మనసా
లేదులేదు జన్మము లక్ష్మణయని వాదము దొలగించిరె మనసా ॥ ఓం ॥

**సుజ్ఞానాతీత తత్త్వఖండమాల**

## గురుసూచన తత్త్వము

చూడారా ఈ బ్రహ్మము ఎడతెగకయున్నది - యేడ జూచిన బ్రహ్మమూ
చూడరా యీ బ్రహ్మమెప్పుడు - జోడు లేకను నామరూపము నాడు నేడనరాక
నిరతము గూఢముగ గురు రూపమైనది. ॥ చూ ॥

జనక శుక సాందీప కృష్ణులు అనువుగా అర్జునుడు మొదలగు
ఘనులు మౌనులు ఋషులు యోగులు సనకసనారదులెన్న దగినది ॥ చూ ॥

శ్రీధరుడు శివరామదీక్షితులాదిగా గల అప్పబ్రహ్మము
ముదముతో శ్రీ పరశురామమూర్తి దేశికవరులు గన్నది ॥ చూ ॥

ధరిణిలో భాగవత కృష్ణుడు పరమపదమును అతని చేగని
సరగునను విను లక్ష్మణాఖ్యా తిరిగి జన్మము రానెరాదని ॥ చూ ॥

సుజ్ఞానాతీత తత్త్వఖండమాల

# పూలదండ

శ్రీమద్భాగవత కృష్ణ దేశికులవారు
శ్రీమత్పీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువులవారికి అనుగ్రహాధికార పూర్వకముగా
వ్రాయబడిన పద్యరత్నత్రయం

సీ॥ ద్విజకుల శ్రేష్ఠుండు దివ్య ప్రభావుండు । సత్కవివర్యుండు శాశ్వితుండు ।
సత్యప్రవీణుండు సత్సంగ వినుతుండు । నిత్యనిర్ముక్తుండు నిశ్చలుండు ।
మానసోల్లాసుండు మదగర్వ నాశుండు । చిత్కళతేజుండు చిరయశుండు ।
బోధస్వరూపుండు బుధజనస్తోత్యుండు । యిమ్మహి చంద్రుండు యీశ్వరుండు॥

గీ॥ అచల భావంబు బోధించు ఆర్యవర్యు । డైన శ్రీ భాగవత కృష్ణు నాశ్రయించి॥
బోధపడసియు శిష్యుల బాధలణగ । పల్కెలక్ష్మణ దేశిక ప్రభువరుండు ॥

సీ॥ శ్రీభాగవత కృష్ణ శ్రీపాదపద్మముల్ । భావంబులోచాల భక్తితోను ।
హృదయ పీఠంబున నునిచి పూజించియు । శరణులు గావించి చెంత నిలిచి॥
అంజలి జేసియు నతిమోదమున పాద । తీర్థంబు గ్రోలియు తిమిరమణగ ।
త్రివిధ ప్రసాదముల్ తిన్నగ భుజియించి । జనన మరణ ప్రభావంబునణగ ।

గీ॥ బోధజేయు మటన్నను బుధవరుండు । ద్వాదశాక్షరి, తదుపరి షోడశియును॥
బోధగావించి, దీనిని యాదిమరచి । యుండవద్దని తెల్పియు నుచితముగను॥

కం॥ ఓ పీలుఖాన లక్ష్మణ । ఓపికతో నచలబోధ, నీకిచ్చితి, నీ ।
వే ప్రొద్దు తలచి నొరులకు । తాపంబులు బాయుకొరకు తగనివ్వుమిలన్ ॥



శ్రీ పూర్ణప్రకాశ గురవేనమః

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధాకారణ మవ్యయం ।
భావాతీతమహం వందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥



# శ్రీధరస్వామి శివరామదీక్షితుల వారి చేసిన పరిపూర్ణ బోధ

యీ వొక్క శరీరం లేకుంటే జ్ఞానము లేదు । కర్మాలు లేవు. జ్ఞానానకు, కర్మానకు శరీరమే మూలము. శరీరానకు మూలం ఏమీలేదు. స్వామీ । శరీరానకు మూలం ఏమీ లేదంటిరి । మూలం లేని శరీరమైతే ఏ మూలంగానాయె । వారీ గ్రహించ నేర్పుగల బుద్ధిమంతుడవైతే తాత్పర్యముగా చెపుతా వినురా । పృథ్వి వ్యాప తేజో వాయురాకాశాదు లాయెను। ప్రకృతి పురుష స్వరూపము రెండు విధములై విశ్వరూపముగా ఆయెను । స్వామీ। అయిదు భూతములు ప్రథమము యేట్లాయేను । శిష్యుడా । చెపుతా విను । చూచినపుడే ప్రథమం । నడిచినపుడే ప్రథమం । కదలినపుడే ప్రథమం। కన్నప్పుడే ప్రథమం । మొదలు కార్యం తలపెట్టకమునుపు ప్రథమం లేనే లేదు. । హేతువు లేక మునుపు భూతములు లేవు । భూత సంచారమే హేతువు । హేతుర్భూతమే జగత్తు । యిటువంటి జగత్తులకు అనాది సిద్ధాంతమే ప్రకృతి । ప్రకృతి తనకు తానేమూలం గనుక । తనకు తానైన స్వయం నేతృత్వానకు మూలం లేదు ।

స్వామి । ఇక్కడ మూలం లేదని చెప్పుచుంటిరి పెద్దలు కొందరు పరాత్పర స్వరూపం చాత । కల్పితం అయినాది అంటారు । సత్యమా అసత్యమా।

వారీ శిష్యుడా । అడుగుట యందు యోగ్యుడవే కాని కరతలామలకంగా విను చెపుతా । వివర్తుదనయ్యా యెక్కడ తట్టక భయపడక పరిశీలన చాత సంశయము తీరేటట్టు అరుసుకుంటూ దాటురా ।

పృథ్వి పృథ్వే కదా । పృథివి యందు పుట్టిన రేణుసస్యాదులు పృథ్వి హేతుర్భూతమే కదా । "పృథ్వాం హేతుర్భూతో భవతి" ॥ శృతి ॥

వుదకము ఉదకమే కదా । వుదకముతో పుట్టిన నాచు మత్సజల చరాదులు మొదలు చేసి వుదక హేతుర్భూతమే కదా "అపో హేతుర్భూతో వర్తతీతి" శృతి ॥

అగ్ని అగ్నే కదా । అగ్నిలో పుట్టిన పంచలోహాది పచనం మొదలు చేసి । అగ్ని హేతుర్భూతమే కదా । "పావకోజాయతే హేతుర్భూతో వర్తతీతి" శృతి ॥

వాయువు వాయువేకదా । వాయువువల్ల పుట్టిన వస్తు మేఘాది సుడి మొదలు చేసి వాయుహేతుర్భూతమే కదా । "పవన హేతుర్భూతో వర్తతీతి" శృతి ॥

ఆకాశం ఆకాశమే కదా । ఆకాశమందు పుట్టిన వస్తు నక్షత్ర నానావిధ స్వరూప గర్జనలు మొదలు చేసి ఆకాశహేతుర్భూతమే కదా । "ఆకాశహేతుర్భూతో వర్తతేయితి" శృతి ॥

ఇట్లు పంచభూతాల వల్ల కల్పితం అవుచుండగా । పరాత్పరవస్తు అహేతువైన పరిపూర్ణం నిరాలంబం । అప్రమేయానకు జగత్తు చేసె ప్రమేయం దానికి వున్నాదని చెప్పెడివాడు । చెవిటివాడయ్యి వినేటివానికి వివరం వుండవద్దా । ఆయా దృష్టాంతరం చెపుతావిను । మేడి వృక్షం తనయందు కాయల కాయించి । కాయలందు పురుగుల కల్పించి । తనకు తానే వున్నట్టు ప్రకృతి స్వగత భేదం అలాగే వుంటాది । యెవరూ చేసినారు అంటుంది । కోతి కొమ్మ తప్పదు । యిటువంటి కోతి గుణాలు కలిసినటువంటి శరీరం । జగత్తు యెవరో చేసినారు అనితానే అంటుంది। పరతత్వ సంధానం తెల్యక । సంధానం తెలియని తత్వవిచారాలు కొనసాగవు. అలాగే అంటారు । సూత్రంతెగనివ్వరు । సాలె కీటక దృష్టాంతరం। అటువంటి వారే దండివారని అనిపించుకుంటారు ।

స్వామి యీ జగత్తును యేది సృజన చేస్తుందో దాన్ని వివరించి తెలిసేటట్టు సెలవియ్యవలెను । వారి శిష్యుడా తాటిమీది పాటవలె కాక విజ్ఞానస్థుడవై వింటివా కడతేరుతావు । జగత్తుకు మూలం ప్రకృతి । ప్రకృతి మూలకంగా ప్రాణం । ప్రాణం మూలకంగా మనస్సు । మనోబుద్ధి చిత్త అహంకార భావాంతకరణ దేహేంద్రియాలు । వొకదానికి నొకటి సూత్రంబలవంతము చాత । సుఖం వచ్చినపుడు సంతోషించుకుంటూ । దుఃఖము వచ్చినపుడు వేదన పడుకుంచు వుంటుంది । కనుక ప్రకృతి స్వధర్మం తియ్యటి దినుసు సుఖం అదివిరుద్ధమైతే దుఃఖం । అనాదియే సిద్ధాంతమె ప్రకృతి। ప్రకృతి బద్ధత్వమే జగత్తు । కల్పన చేసేందుకు కారణం ఏమీ యెవ్వరు చూచేటి కొరకు ।

వారీ । శిష్యుడా । నీవు చూడంగ వుంటూ వున్నది । కన్నులు ప్రకృతి । ప్రకృతి ప్రకృతిని చూచేటి కొరకు । మరి దినుసుల చూచేటి కొరకు గాదు సుమీ । దాని దృష్టాంతరము యేలాగంటేను । అద్దాల మేడలో కుక్క ప్రవేశించినది । అద్దాల యందు అనేక కుక్కలు కనపడ్డవి । నేత్ర దర్పణ మందు అనేకమైన విశ్వము కనపడ్డది । ప్రకృతి గాని వస్తువ వకటైనా లేదు । తనకు తానే చూస్తుంది । తనకు తానే నానావిచారాలు యిదిగూడ ముచ్చటా । శరీరధర్మము అన్నట్టు ప్రకృతిధర్మము । స్వామీ యింతకల్లోలంగా మూలం లేని యీ ప్రకృతి స్వధర్మం వినంగ గట్లవున్నాది । యిదివిన తరమయ్యాన సులభంగా కనతరమయ్యానా । బట్టబయలుకు లేదంటిరి । వివరించంగా వున్నట్టే వున్నాది ।

వారీ శిష్యుడా । నీవు నడిచేటి వాటి పేరేమీ ? పాదాలు చూచేటివి ఏమిటి ? నేత్రాలు । వినేటివి ఏమీ ? కర్ణాలు। నమిలేటి వేమి? పండ్లు । చప్పరించేది. నాలుక । మోసేది తలకాయ । చేసేటివి చేతులు । అలాగే వేళ్లు । నరాలు । శల్యాలు । మాంసం । ముక్కు । పెదవులు । పిక్కలు । తొడలు । నాభి । మొదలుగా గల అవయవాలు దేని పేరు దానికి వివరించి పలికితివి గాని యివి యన్ని కూడుకొని యేకాకృతమై యున్నది । యది ఏమిటి? స్వామీ అది దేహము । దేహమే కదా । సత్యము దేహమే । మరి యొకటి కాదుగదా । కాదు । గుర్తెరిగే దేహమని చెప్పితిరి । యీ దేహం ముచ్చట అటువుండనిమ్ము । మరి నీవెవ్వడవు ? స్వామి అది నాకు తెల్యదు । ఇవి అన్ని యెట్లా చెప్పినావు । చెప్పినా గాని యిది నాకు తోచదు । తోచకుంటే దేహంను అరుసుకో । వూరకున్నాది ।

వారీ శిష్యుడా । వెదవ ముండా కొడుకువు గదరా । సకల విశ్వమును కల్పించేటిది దేహం । విశ్వరూపం । నానా వస్తువులై వుంచూ వుండంగా । నీవు వ్యాపకుడవై యున్నా । నిన్ను నీవు తెలియకున్నా వదేమి । సకలదేశాలయందు । సకలకాలాల యందు । సమస్తమైన వస్తువుల యందు । చెలించక । ప్రవేశించక । వెళ్లిపోక । రాకడ పోకడలేక । నీకు నీవు సరిపడే విధముకావలె । నీ యింటి పాత బానిసను। వాకిటకుక్కను । నన్నుకడతేర్చువారు మీరే తల్లిదండ్రులు । సాక్షాద్గురు స్వరూపము । నన్ను ఏ చొప్పున తరింపజేసినా మీరే । లెస్స తెల్య జెప్పవలెను । "శాస్త్రదృష్టం గురోర్వాక్యం తృతీయం ఆత్మ నిశ్చయం" । కారాగృహనమో దేహ । పీడితావాప్తసప్నవత్ । నిష్కారాగృహ దేహంచ నిష్ఠిప్పిరిత పంచారవం స్వప్నవత్ । దేహం లేనపుడు జగత్తులేదు । దేహం జగత్తు లేనపుడు కేవలంబట్టబయలే వున్నాది । యీ బట్టబయలు కన్నవారు భ్రాంతిలేనివారు అవుతారు । కననివారు భ్రాంతి ఆవర్తం చాత చచ్చుతూ పుట్టుచూ వుంటారు। వుపాది నుండి నిరూపాధికంగా వున్నవారే । నిజగురు సాంప్రదాయకులు । స్వామీ । ఆచార్య పురుషులు గనుక అడగవలసివచ్చే। కేవలంబట్టబయలు । యెప్పటికి శాశ్వతంగా వుంచూవుండంగా । మూలం లేక యీ గుర్తెరిగే శరీరం కొంచమైనా లేకపాయె ।

వారీ ! పురుషుడు ప్రకృతి రెండు స్వప్నములో స్వప్నం సంసారం చాతా నానా కల్పన ఆయ । వెంటనే తెల్వి స్వప్నం లేనేలేదు । లేనప్పుడు కథలు లేవు. శాస్త్రాలు లేవు. చదువులు లేవు. యేమిలేని బట్టబయలు ఏమీలేక తానే దృఢంగా వున్నాది । వున్నదాన్ని లేదన శక్యంగాదు । దేహిదేహాల సంధు మాత్రం వున్నాది । కనుక సూత్రం తెగనివారు చింతాకుల వంటివారు। మళ్లా చిగురాకుల వంటివారు । శాశ్వతమైన బట్టబయలుకు జగత్తు వున్నాదని యెరుకలేదు । యెపుడు యీ జగత్తు అని తోచి వుంచాదో అపుడే వుంచాది । తోచిన హేతువును బట్టబయలు పుట్టించింది కాదు । పుట్టిన హేతు శాశ్వతమైంది కాదు । హేతు శరీరోపాధి నుండి పుట్టింది । శరీరోపాధి నుండి రహితమాయ । వున్నబట్టబయలు యప్పటి వలెనే వున్నాది । స్వప్నం వచ్చినపుడు వున్నాది । స్వప్నం లేనపుడు వున్నాది । దృష్టమైన

పదార్థం నష్టమౌచూ వుండంగ దృష్టం లేని బట్టబయలే వున్నాది । యటువంటి దృష్ఠమైన ఆవర్ణం వెళ్లేటందుకు । చీకటివంటిది కనుక । యంతదూరం తిరిగినా వారి జాడపడదు । విచారము చాత అతిసులభము । సాధనలచాత సాధ్యముకాదు । యుగ యుగాంతరముల నుంచి వస్తున్న ప్రకృతి వేగిరం సాధ్యము కాదు । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం వుండంగ పరాత్పర అచల సమాధికావలె । ఇది అందరికి లభిత మయ్యేదికాదు । చూచిన వారికల్లా చెప్పేది కాదు । అతిరహస్యమైన అంతరాత్మలకే గాని యితరులకు అలవికాదు । బుద్ధిమంతుల సొమ్ము। స్వామీ । ఒక విన్నపము కలదు । యేదయినా పూని నిధానముగా ఆజ్ఞ యివ్వవలెను । వారీ శిష్యుడా । చెప్పినరీతి అర్పించ గలవా? పృథివి పృథివికి అర్పించు । వుదకము వుదకాన కర్పించు । అగ్ని అగ్ని కర్పించు । వాయువాయుకర్పించు । ఆకాశం ఆకాశానకర్పించు । యీ అయిదు భూతముల ఐదు భూతములకర్పించి । నీవు నిరాళుడవై యుండుటే పూజావిధానం। వుపాధి నుండి యంత పూజ చేసిన కొద్ది వుంచాది । విధితమైన పూజ యంతకాలానికైన యీ చొప్పున చేస్తూ వుండు। యిదే పరిపూర్ణానుభవము। వుపాధిరాహిత్యమైన పూజాశాయవలెను। నాదభిందు కళాత్మకమైన ప్రకృతి రహితమగుచూ వుండంగా అతీత పదమందు కూటస్తుడవైన నిజస్వరూపుడవై వుంటావు । యే శాస్త్రము నమ్మక శరీరోపాది సర్వకల్పిత పరబ్రహ్మ వస్తు కల్పన చేసిన వస్తువులు శాస్త్రాలు, వేదాలు, పురాణాలు, నానాజాతిభాషలు అని దృఢంగా విచారించి నిద్రలో స్వప్నం తెల్విరాంగా । శాస్త్రాలు లేవు । పురాణాలు లేవు. వేదాలు లేవు । వ్యవహార శూన్యం క్రియాశూన్యం । స్వామీ శిలా తొలిచి స్తంభము పాతినట్టు సూచన శాయవలె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం సమూలం । యేమిలేనివారే। పేరులేనివారు । వున్న బట్టబయలుకు రూపంలేదు । పేరు లేదు । కథలు లేవు । తనకు తానే దృఢం అయ్యి వున్నాది । పరస్పరం తన వినహా చూచే వారికి వెతుకులాడినా దొరకదు । వొక్క పృథివి లేకుంటే జగత్తు ఏలాగు ఏమీలేదో । అలాగే యీ శరీరము ఒక్కటి లేకుంటే యేమీ లేదు । యెత్తుకుంటే మొత్తుకుంచుంది । దించితె వూరకుంటుంది । అంటితె అంటదు । అంటకుంటే అంటుతుంది । చావక చచ్చినట్లు కాలిన నులక చందము । శరీరావరణము చాత వుంటివా యుగయుగాల కయినా చక్కిపడదు । విచారంచాత నిముశమందె చక్కిపడుతుంది । శరీరావాప్తిజగత్తు అవుచుండంగ వ్యాపకమై వున్నాది । నిన్ను నీవే కానవు । అదిగాకను మరివొఘటి యనుకొనుటే వుపాధి ధర్మము । వుపాధి నుండి అన్నితోచి వస్తావి । అన్నితోచివచ్చే వుపాధి లేనపుడు లేక వున్న దాని యందు వుండి లేనివాడవు । యిప్పుడే కావలె । అయితే నీకు వుపాధికి చాలా దూరము । వుపాధి రహితమైతివా నీవే శాశ్వతుడవు । నీకన్యమైన వస్తువు లేదు । సమస్త వుపాదులు చూచే నేత్రాలు ప్రకృతి । భావమై చూస్తూవుండంగ ఆస్థలం లేకుండా లేనట్లూ వుండ చూచుకొనె వారికి । యీ శరీరం సర్వశూన్యం । లేదా వున్నది । వుంటే లేనిది । కనుక వుండి లేనిదాని యందు లేక వున్న వారే వస్తు స్వరూపులు । అదె బట్టబయలు । అష్వంటి బట్టబయలుకు దిక్కతువుందా? జన్మము లేదు మరణం లేదు । వికారం లేదు। శాస్త్రాలు లేవు । పురాణాలు లేవు । కథలు లేవు । జగత్తు లేదు । అదే తాత్పర్యం । దృఢంగా విచారించు । పాత్రలోను జలంలోను ప్రకాశించిన సూర్యుడు పాత్రలేని చోట వుంటాడు । వున్నచోట వుంటాడు । దేహస్వరూపమైన పాత్రలోను నీవు ఆలాగు వుంటావు । నిన్ను నీవెకని । ఆ తీరు తాత్పర్యం దృఢం చేసుకో । దృష్టాంతం నష్టమయితే స్వయం ప్రకాశకుడవె నీవు । నీవు లేని చోటు లేదు । నీకు స్థలం లేదు । వుపాది లేదు । సకలదేశాల యందు । సకలకాలాల యందు । సమస్తమైన వస్తువుల యందు చలించక । ప్రవేశించక । వెళ్లిపోక । వ్యాపకత్వం చాత వున్నావు।

స్వామీ వుండిలేని శరీరమందు లేక వున్న వాడవని అంటిరి ప్రపంచం నడిచేది యట్లా? । వారీ తెలివి గురుతులచాత నడిచే శరీరం నడుస్తు వుండంగ వినేటివి వించువుండగ । కనేటివి కంచు వుండంగ । అనేటివి అంటు వుండంగ । అంతర్బహిస్సుల యందు వ్యాపకస్తుదవయ్యి। అచల సంధానంచాత । అంతర్ముఖ మందు ధర్మన న్యాయకంగా వుండి లేనివాడవైతే । లేక వున్న శరీరం వున్నా యేమీ లేదు । ప్రపంచము నడిచినా ఏమీ లేదు । యెన్ని కలలు కన్నా ఏమీ లేదు। లేదు లేదన్న వారికి వున్నా ఏమీ లేదు । కలవు కలవన్న వారికి కలదు జగములు। యట్లా నడువ వలె స్వామీ । అంటివి కనుక । నడిచేది ఏమీరా ? తెగిన గాలిపడిగె విచారించు దృఢమైన వారికి దృఢమయ్యే వున్నాది సరిపడివున్న దాన్ని పూర్వ పక్షము చేసేందుకు యెవ్వరి తరమయ్యేని । కాదు స్వామీ తత్పదస్తానము అయ్యేది మహాదుర్లభం । వినరా

శిష్యుడా । తత్పదమనగా సృష్టి కల్పన లేక ముందు తత్పూర్వమైనదే తత్పదం । నీవు పొందినటువంటి వాడవు అసి అయితివి । అందుచేత వుపాధి లేని వాడవు అయితివి । సకల పురాణాలు వేదాలు శాస్త్రాలు మూలంలేని సర్వకల్పన । పరబ్రహ్మావస్తు కల్పించింది కాని । బట్టబయలుకు కల్పనలేదు । కాష్టమందు అగ్నివుండి కాష్ఠం దహించి తాలేనట్టు । వుపాధి స్వప్నమని తెలిసినపుడు నీవులేనివాడవు । శరీరం వుండి లేనిది । లేక వున్నది లేకనే వున్నది । వుండి లేనిది వుండి లేనేలేదు । స్వామీ మీరనేటివి శబ్దములు కదా । మొదటి అక్షరము కంటే మొదట చివర అక్షరము కంటే చివర తుదా మొదలు ఏమీ లేక వున్నది । మధ్య గతమైన అక్షరరూపములు గుర్తెరిగే కాలమందు పాత్రకు పరస్పరుడవయ్యేవా కావా? పాత్ర సమూలంగా వజను చేసి తెలివి అయినపుడు పాత్ర వున్నదాలేదా ?

వారీ శిష్యుడా । లేనివాడైతె లేకుండా చేస్తాడు । వున్న వాడైతె పంచవింశతీ తత్వములలో బందోబస్తు చేస్తాడు । యింతకంటే మహాత్ములు యెవరు వున్నారు । వారీ శిష్యుడా । పాశానాల ప్రతిమెల ముందర నేవైద్యములు పెట్టి అనుభవించు మన్నట్టే । మొద్దులకు మొద్దులేగతి । ప్రతిమ గుర్తు వున్న ప్రతిమ రెండు వొక్క సమానం అవుచావి । స్వామి రెండు ప్రతిమెల వివరము చేసింది అది ఏమిటిది అవు। వారీ శిష్యుడా । కలలు మూడు విధములు । యట్లా అంటివా । జాగ్రత్త ప్రపంచావస్త । నిద్రయందు స్వప్నావస్త । సుషుప్తి యందు జఢావస్త । మూడవస్తలచాత వుండేటటు వంటి ప్రకృతి నా స్వప్నమందు దాచుకొన్న ధనము । తెలివి అయితే లేనట్టువలె । జాగ్రతకల యీ కల కుదరదు । జాగ్రత్త స్వప్న సుప్తి జాతి అయినటువంటి ప్రకృతి । తెలియజేసితాను శూన్యం అయ్యింది గనుక విదేహం బలుకదు। వుపాధి నిరాస్పద మనుకుంటూ పలికింది । శబ్ధము ఆకాశ సంభూతమని విచారించు । యేమి లేనపుడు యేమిలేదు । యేమో వున్నాదని అనుకొన్నపుడు యేమో వున్నది । వున్నదని వున్నదే అన్నది । లేదు లేదన్నది లేకనే వున్నది । జాగ్రత అయితేనే గాని యీ కలకుదరదు । వారీ శిష్యుడా । నీవు చూచే చూపు విశ్వమంతా వ్యాపించి వుండంగా । నీవు వ్యాపించిన వాడవు కాక పోయితివా ఏమీ ? వారీ । దృష్టాంతరం చెబుతా విను । ప్రకృతి పురుషుడు । కాయాపురి పట్టణమందు స్వప్నవత్ । రాజ్యము చేస్తూ వుండంగ యుగాలు జరిగిపాయ। వొకనాడు స్వప్నమందు రాజు వ్యాటమార్గం పోగా । వెనుక నుండి దొంగలు తరుముకొచ్చినట్టాయ । పారిపోంగ ముందర పెద్దపులి మీద పడ్డట్టాయ। రాజు చస్తినని దిగ్గున తెలివాయ । యెక్కడ ఏమీ లేకపాయ । అటువలెనే తెలివైనా వానికి యెక్కడ ఏమీలేదు । యిది ధృఢమవుటకే పరిపూర్ణానుభవము । మృష జగత్తు లేనేలేదు । జ్ఞాన వికృతి చాత జగత్తు వచ్చి వుండే । పాయె జ్ఞాన వికృతిత్రయం రాలేదు పోలేదు । వుండనూ లేదూ । వున్నది స్వయం ప్రకాశం వుండే వున్నాది । స్వామీ। స్వయం ప్రకాశం దేహాస్పదమందు వుండ జూపవలె । బుద్ధి పృథివి । చిత్తం వుదకం । అగ్ని అహంకారం । మనస్సు వాయువు । జ్ఞానం ఆకాశం । జ్ఞానాకాశం మీద సోమసూర్యనాళ్లు । యీడ పింగళ రెండు సంగమమైనదే సుషుప్తి। సుషుప్తి యందు జాగ్రస్వప్నములు లీనమైనది । కనుక సుషుప్తిని దాటకుండా హేతుర్భూతమనె కవాటం వున్నది । అటువంటి కవాటం వేసేవారే గాని తీసేవారులేరు । అటువంటి హేతరుర్భూతమనె కవాటం విగళితం చేసి । కదియించి । యీవలికి రాకు సుమా । అదే పరాత్పరస్తానం । అదే కేవల బట్టబయలు । అహేతువైనది కనుక । అదె అచలం ।

స్వామీ । బుద్ధి లోపలి నుండి చిత్తములోనికి తీస్తిరి । చిత్తములోపలి నుండి అహంకారంలోనికి తీస్తిరి । అహంకారము లోపల నుండి మనస్సులోనికి తీస్తిరి । మనస్సు లోపలి నుండి భావాకాశంలోనికి ప్రవేశింపజేస్తిరి । భావాకాశంలో నుండి యీడ పింగళ సంగమమైన సుషుమ్నలో ప్రవేశింపజేస్తిరి । సుషుమ్నలోపల హేతుర్భూతమనే కవాటం చూపితిరి। హేతుర్భూతమనే కవాటం దాటించి మీ చరణముల యందు లీనము చేసుకొంటిరి । నాజన్మ కడతేరే । పునర్జన్మ లేకుండా జేస్తిరి । బహు ఆనందమాయె । యేమి అనతోచదు । సముద్రము కాలనడచినట్లాయ । కృతార్థున్ని చేస్తిరి । యిట్లా యెవ్వరు చెప్పేరు । యది మహారహశ్యము । సకల లోకములు నిర్లోకము చేస్తిరి । స్వయం ప్రకాశం వున్నది వున్నట్టే వున్నది ।

**శ్లో॥ అవలీలంగురోపుత్ర । త్వమేక శరణం మమా । ఆకాశస్య**
**నిరాకారం । నిరాకారం పునఃపునః శ్రీకైవల్యపరస్తానం । అవలీలం గురుంభజే ॥**

ప్రథమ ప్రకరణము సాందీపవాక్యములు ప్రింటు అయిందిగన్కవ్రాయలేదు.

# ద్వితీయ ప్రకరణం

**శ్లో॥ నచైతన్యం శాశ్వతం శుద్ధం । వ్యోమాతీతం నిరంజనం ।**
**నాదు బింధు కళాతీతం । తస్మై శ్రీగురువేనమః ॥**

బయలే అఖండం । గుర్తెరిగే శరీరరమే ఖండం । గనుక లేనేలేదనే గురువాక్యమే సార్వకాలం వుంటుంది । అంతా అఖండమే । అఖండం తప్ప విడిచి రెండోది ఏమిలేదనే సిద్ధాంతం । సిద్ధాంతమేరాద్ధాంతం । అశరీరం సర్వదాస్తి । శరీర రహితం సదా । అయమేవ సద్యోముక్తి । అన్యదాభ్రమ కారణం । అందుకే శరీరం లేనేలేదు । అని సర్వకాలం అభ్యాసం చేయవలె । చేస్తే అచలమే ।

1369 పత్రం నుండి కమ్మలు, శిథిలమైపడిపోయినందున 1371 పత్రం నుండి వ్రాయనైనది.

అనుభవము లేదు గనుక బట్టబయలుకు సార్వకాలం ఏకరీతి యేక ప్రకారమే । యీ గుర్తెరిగే శరీరం పుట్టుకమునుపు వున్నది । శరీరం చచ్చిన తరువాత వున్నది । యీ గుర్తెరిగే శరీరం లేనేలేదు । యీ శరీరం లేదని పలికినపుడు వున్నది। యీ శరీరం లేనేలేదని యెవ్వరు మేల్కొన్నారో । వారే భ్రాంతి రహితులు । వారే పుణ్యాపాపరహితులు । వారే జ్ఞానాజ్ఞాన రహితులు । వారే సత్యాసత్యరహితులు । వారే సుఖదుఃఖరహితులు । వారే ధర్మా ధర్మరహితులు । వారే జ్ఞాన కర్మ రహితులు । వారే ద్వైతాద్వైత రహిత పరమతత్వ స్వరూపులు । వారే నడువని వారు । వారే నిలబడనివారు । వారే రెప్పపాటులేనివారు । వారికి సార్వకాలం గుర్తెరిగే శరీరం లేనేలేదు । కనుక బయలుకు రెప్పపాటు ప్రకారంగా వున్నదానికి। భ్రాంతివున్నదో లేదో అని నిర్ణయయము చేసినా అందరివంటి భ్రాంతుడే । అహంకారం తెగిపోక వున్నది వున్నట్టే వుంచుంది । యిందుకొరకు శ్రీఘ్రంగా వున్నది వున్నట్టు తెల్పెవారిని కనుక్కొని । వున్నది వున్నట్టు తాత్పర్యం । ఆయనా శతృక్షయం అయినట్టు । అషు తరువాత నిర్ణయమే లేదు । సుఖదుఃఖరహితమయ్యి । ఆదిమధ్యాంత రహితమయ్యి । పోక వుంచావు । రాకడా లేదు పోకడా లేదు । స్వప్నరూపి । విస్మృతి కంటే మరివొఘటి అధికం వున్నదని । అహంకారం వున్నదో లేదో । అంటే । సంశయం । యేమిలేదని । అంటే ఛౌద్దుడు యేమిలేనియొరుకే । సార్వకాలం లేని పరాప్రకృతి స్వరూపం

**శ్లో॥ అపరేయ మిస్త్వన్యాం । ప్రకృతిం విద్ధిమే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో । యయేదం ధార్యతే జగత్ ॥**

**శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి । సర్వ క్షేత్రేషుభారతా ।**
**క్షేత్రక్షేత్రజ్ఞయోరస్యం । నామరూపవివర్జితం ॥**

క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూప ప్రకృతి ద్వయదోషరహితమైంది స్వతః సిద్ధం స్వస్వరూపం ఇష్వంటిదని అడుగుటం వున్నదా లేదా । సార్వకాలం ఏక ప్రకారం గనుక । యేక ప్రకారం పోయితే । పుట్టుకా చావు వున్నదా । లేదా యేక ప్రకారంగా వున్నదే వున్నది । వున్నదో లేదో । వినకరి లేకపోయితే । యీ దేహంఏమీ నేను యేమీ । వున్నది వున్నట్టే వుంటే ।యీ దేహం ఏమీ । నేను యేమీ । అనె సంశయం పుడుతుందో పుట్టదో। వున్నది వున్నట్టా । పో । అద్గు । అయ్యేది యెలాగు । కావద్దు । అయ్యేవున్నావు । అడ్గకు । అడిగితె ఏమీ । యెపుడు యాదివున్నదో । అదె అడుతుంది । నీవె చెప్పు । నాకుతోచదు । అంతా అష్వంటిదే । యీ వ్యవహారం యేమీ । నీ యందు వున్నది లేకవుంటే లేదనుకొ । స్వతశిద్ధమై నీయందు చెప్పెవారు యెవ్వరు । వినేవారు యెవ్వరు । నీవు యష్వంటివారివో । అందరు అష్వంటివారే ।

అష్లైతే నిర్ణయమే లేదు । వున్నదో । లేదోని తాత్పర్యం విడువకు । నాతో మాట్లాడు । సార్వకాలం ఆలాగే । మరివొఘటి వున్నాదని యెరుక లేనిదయిన యెరుగుదునూ । అని భ్రాంతిలో పడితి వాయెనా । అదితిర్గేది మహాకఠినం । దానికి యంత ప్రయత్నం చేసినా । అసాధ్యం । అదికావలెనని నీవు అనేకముగా కర్మాలు చేస్తావు । అనాచారం చేస్తే అయ్యేమని చేస్తున్నారు । వర్ణాశ్రమ ధర్మాలు విడిస్తే అయ్యేమని విడుస్తున్నారు. కపోలాసము మొదలైన యోగాలు చేస్తే అయ్యేమని చేస్తున్నారు । మంత్రానుష్ఠానము చేస్తే అయ్యే మని చేస్తున్నారు । సంశయము పోతే అయ్యే మని చేస్తున్నారు । సర్వకాలం శ్రవణాదులు వింటే అయ్యే మనిచేస్తున్నారు । యేది చేసేవారు అదే చేస్తున్నారు । అష్వంటిదాన్ని యెవ్వరూ అడగరూ । యెవ్వరు కాలేరూ । గురుసాంప్రదాయం చాత వున్నది వున్నట్లు తనకే తాత్పర్యము కావలెను । తానుకాదూ। మరివొఘరు చాయలేరు । యేమైనా బ్రహ్మవిద్యకు గురుసాంప్రదాయమే కారణం గురువు కంటే అధికం లేదు । పర్యవసనందనాపేక్ష లేకుండా । వున్నది వున్నట్లు తాత్పర్యం చేసినవారే గురువులు । చెప్పినవారు । చదువు కొన్న వారితోటే పోయిరి । సార్వకాలం ఏక ప్రకారమే గనక । చదువుకోలేదు । జీవోపాధిని వున్నదని యెరుగడు । వినంది । చూడంది గనుక । సార్వ కాలం । అదే అది । అదియష్వంటిదో । అష్వంటిదే అంతా । అదిగాక మరియొకటి వున్నదని యెవ్వరు అనరు । యెరుగంది యెలాగు అనేరు । యిదే తాత్పర్యం । యెవ్వరెవ్వరికి వావులు వరుసలు కులాలు గోత్రాలు మర్యాదలు యెవ్వరు చేసినారు । యెవ్వరు విన్నారు । యివి అన్ని యెక్కడికి పోయినవి । వీటిజాడ యేమీ చెపుమా । యెవ్వరు వున్నవి అంటే వార్నే అడుగు । నేను యెంతో అంతే గాని మరివొక జోలివినలేదు । చూడలేదు । యెరుగ । సార్వకాలం ఏకప్రకారం గనక । వున్నది యేమో । లేనిది యేమో । విభాగం పోయితె నిర్ణయం చాయ వచ్చునా । నిర్ణయం ఏమని చాయా । యెపుడు ఏకప్రకారం । దాని వంటిదే అని యెవ్వరికి చెప్ప । సర్వకాలం అదియేది యేది అని యెరుక లేక వున్నదాని యేలాగు విభాగం చేయ్య । మహాసాహసుడవుపో పెద్దలతో కూడి యుండవలె । తాత్పర్యం చేసుకోవలె । చేసుకోకపాయేనా । వున్నది వున్నట్లు తాత్పర్యం । అయ్యి భ్రాంతిలో పడుచూ యీత వచ్చినవాడు మునిగినట్లు మునుగుచాడు । ధృఢమయ్యి యీత వలె వుండవలె । ఇది అంటే చెప్పుచా । సార్వకాలం పుట్టని చావనిదె అంతా । పృథ్విన్ని అదే । పుట్టని చావని దానికి పృథ్వి అని యెరుక వున్నాది । పుట్టనిది యష్వంటిదో । అది అని భ్రమలేదు । పుట్టని దానికి పృథ్వి యెక్కడిది । పుట్టని చావనిది ఆకాశం మొదలైన వారిని పుట్టించీన్ని । సద్గురు స్వానుభవరహితులు । ఆత్మానాత్మరహితులు చెప్పినారు । పుట్టని చావనిది గనుక జగత్తు అని నమ్మరాదు । క్షేత్రజ్ఞ స్వరూపమయిన జీవాఖ్య పరాప్రకృతి అని చెప్పరాదు । ఉపాధి ద్వయదోషం వున్నదో లేదో పుట్టనిదె సర్వం । పుట్టునదె అంతా । విత్తనం లేని చెట్టు వున్నదని యెవ్వరూ చెప్పరూ । కారణం లేక కార్యాలు యేలాగు వున్నాయి । అష్లైతె అంతా బ్రహ్మే జగత్కారణం । అష్లైతె శృతి స్మృతి అనె సూత్రాల చాత క్షేత్రక్షేత్రజ్ఞస్వరూప ప్రకృతి దోష స్వరూపు ఉపాధి ద్వయదోషమే చెప్పింది । పుట్టనిది యెలాగు చెప్పుటా । పుట్టింది అదె । అంతా । యెవ్వరితో ఏమిని చెప్ప । చెప్పితె జ్ఞానం చాత గుర్తెరిగే చెప్పవలె । అజ్ఞానం చాత గుర్తెరుగక చెప్పక పోవలె । పుట్టని చావనిది జ్ఞానమా అజ్ఞానమా । పుట్టని వాని పేరు ఏమీ । దానిజాడ యెశ్వంటిది ।వేదశాస్త్రపురాణాలు దాని జాడ యెరుగునా । యెరుగవా । పుట్టని దానికంటే మరివొఘటి వున్నదా । యెవ్వరు నిర్ణయ కర్తలు । యెరుగక నిర్ణయములు చేసి అందరిని అడివిలో కల్పినారు। ఆచార్యస్వాములు యిది వున్నది యిదిలేదని నిర్ణయము చేస్తే యెవ్వరు సుఖదుః ఖరహితులు అయినారు ।పుట్టని చావనిదే అంతా అని । యెవ్వరు భ్రాంతి యెరుక లేక మాటలు ఆడినారు । పుట్టనిదె వున్నది । సార్వకాలం అది పుట్టిందో పుట్టనిదో । దానికి బదులు లేదు । అటువంటి మరివొఘటి లేదు । అది అంతా విభాగం చేసేది మాయా । అదె అవిద్య అదె ప్రకృతి అదిలేకనే వున్నట్లు వుండేది । రెండో చంద్రునివలె రాహువలె లేనిదే మాటమాత్రం అలాగే యీ యెరుక । రెండు చంద్రుడు లేదు । రాహులేదు । విచారిస్తే యెరుక లేదు ।

సార్వకాలం పుట్టనిదే వున్నాది । పుట్టనిదే అంతా । పుట్టనిదానికి తోచనే తోచదు । తోచెనా పెద్దలతో సమాగం తక్వ । విచారం చాలదు సమరసానుభావం కంటే వేరేలేదు । దేహభావం జీవభావం వొదిలినది కాదు । ఇందుకు సమరసానుభవము కలవారి గృహమందు వుండి వారి వారిని చూచి నేర్చుకోవలె । లెస్స విచారం చేసి సమరసానుభవం వుండవలెను । వుండక వేదశాస్త్రమే నమ్మెనా అందరిలో వున్నట్టే । సమరసానుభవము చాత ప్రకృతి ద్వయదోష స్వరూపమే నీవు అవుచుంది । దేహంతోటే అంతా వున్నది । దేహం తోటే అంతా ఏమీలేదు । దేహానకు మూలం ఏమీ లేదు । సార్వకాలం దేహం వున్నదో లేదో అని జ్ఞానం చాత విభాగం లేదు । సమరసానుభవం కనుక అంతా పుట్టని చావనిదే । పుట్టని దానికి ఏమీ వుపాధి వున్నది । ఏమీ వున్నదో అదే అంతా । విభాగ జ్ఞానం వున్ననూ రాహువు వలెనే రెండో చంద్రునివలెనే లేనిది వున్నట్టా లేనట్టా । అంతా పుట్టనిదే। నిర్ణయమే కర్తృత్వము । అదె సమరసానుభవముకు విఘ్నం। అంతా యెరుక । యెరుక మరుపులేనిదే । నిర్ణయముచేసేది। పుట్టని కేవలాత్మే అంతా పుట్టనిదె కనుక । పుట్టింది వేరే వున్నదో లేదో యెవ్వరికి యెరుక । యెరుక వుండెనా అది పుట్టిందే । అదే అంతా కనుక । చచ్చేది యేమి అంటివా । పుట్టినది యేమో అదే చచ్చేది । మరి పుట్టేది యేమీ పుట్టనిచావనిదే అంతా । యీలాగు యీదారి అభ్యాసం చేసెనా । చెపుఛా । అషైతే పుట్టేది చచ్చేది లేనేలేదు । అదేత్రోవ నీవు అనుకోకూ। మరివొఘరితోను చెప్పకు । సార్వకాలం ఏక ప్రకారంగా విచారించు । యిదె విచారాకు ఫలం । ఆత్మానాత్మవిచారం విడువదు । సమర సానుభావంతో వుండు । అంతకంటే అధికం లేదు । సమరసానుభవమే రహస్యం । మంచితోవనడువు । దొంగతోవ నడవవద్దు । శ్రవణం సమరసానుభవమే । మననం సమరసానుభవమే । నిధి సమరసానుభవమే । కర్మము సమరసానుభవమే । వున్నది అనవద్దు । లేదనవద్దు । అంతా ఏది వున్నదో అదే అంతా। మరి వొఘటి లేదు గనుక । మరివొఘటి వున్నదని । యెరుగనిదే యెరుగుదును అని । భంగపడవద్దు । పుట్టని ఆత్మ అంతా అని సమరసానుభవం సార్వకాలం వుండవలె । వుండక పాయెనా ప్రకృతి అనె వుపాధిదోషం అవుచాడు। తన జాగ్రత తనకే । ఇంతకంటే అధికం వున్నదని అనిరా వారే క్షేత్రక్షేత్రజ్ఞ ద్వయ దోష స్వరూప వివేక ప్రకృతి ద్వయదోషస్వరూపులే । యిది చిత్తు ఇది జఢం అని । అడివిలోపడి త్రోవదొరకక యేడుస్తారు । భ్రాంతి అధికం గనక సమరస విజ్ఞానం గలవారికి రాజమార్గం । వారికి బ్రాహ్మణులు మాదుగులు అని విభాగంకు మూలం లేదు । సమరసానుభవం వున్నవారికి సమరసానుభవమే విచారణకు ఫలం విభాగం వుండెనా భ్రాంతుడే । సమరసానుభవం పర్యంతరము వరకు భ్రాంతి తప్పదు । సమరసానుభవం ఛాత భ్రాంతి పుట్టదు । పుట్టని చావని దానికి భ్రాంతి లేదు కనుక । అషైతె । పుట్టేది చచ్చేది వున్నదా లేదా । వున్నదని యెరిగినా । లేదని యెరిగినా । యేమి లేదని యెరిగినా । సమరసానుభవం కాదు । మరివఘటి అనుభవం లేదు । రెండోది లేదు అని అనదు । వొక్కటి వున్నదని అనడు । అందరివలేనే వుంటాడు। ఆయనవలె యెవ్వరూ లేరు ఆయెనే ఆయన । దీర్ఘకాలం సహవాసం చాత బుద్ధి మంతులకు జాడవచ్చనీ । వారివారిపాకం విచారించి మెదలుచారు । కనుక్కొనేది కారణం । దయవచ్చి చెప్పవలె । అడుగనేరడు । అనధికారులకు శాస్త్రమే బోధిస్తారు । తమ ఆయము చెప్పరు। చెప్పితె శాస్త్రమే అవుచుంది । గురుడు చెప్పితేనే శిష్యుడు అవుచాడు । పుట్టని చావనిది యెలాగు చెప్పుచుంది । యెలాగు విఁచుది । వినకరి పోయన తరువాత గాని భ్రాంతిపోదు అని కొందరు బోధిస్తారు । సమరసానుభవం జాడవస్తేనేగాని సంశయము పోదు । అంతపర్యంతరము యిదినేను కాను। ఇది కాదు అని కాలం గడుపుచారు । శీఘ్రుంగా పెద్దల సహవాసం చెయ్యవలె । సమరసానుభవం అంటే ఏమీ। ఆ మార్గం ఎటువంటిది అని పదేపదే అడుగవలె । చూచి గ్రహించవలె జగత్తు వున్నదా లేదా అడుగవలె । చెప్పేది చెప్పకపోవుటమో చెప్పకుంటే । వీరు సమరసానుభవం కలవారేమో వూహించవలె । వూహించి వారిని ఆశ్రయించి, వారిని ఆశ్రయించితే దయ చేసి తోవ చెప్పిరా । అప్పుడు అడవిలో నుంచి తోవకు వచ్చినట్టు వుంచుంది । అపుడు సమరసమయన వాసన క్షయం కాగలదు । అపుడు పుట్టని

చావని వాన్ని నేను అని నిశ్చయము కాగలదు। అపుడు నిద్రబోయినవారు మేలుకున్నట్టు అవుచుంది। స్వప్నం లేదు। జాగ్రత లేదు। నిద్రాలేదు। సర్వం పుట్టని చావనిదే అంతా అదే। అదియశ్వంటిదో అశ్వంటిదే అంతా। అంత కంటే ఏమీ। ఏమివున్నదో అంతా అదే। ఇది సమరసానుభవలక్షణం। దీనికి విఘ్నం రాకుండా సమరసానుభవం కలవారితోటి। సహభోజనాలు చేసుకుంటూ వుండవలెను। వుంటే రాగద్వేషాలు। చదువుకున్న ఆత్మానాత్మ వివేకం కలవారి సహవాసం చేస్తే। మునుపటి కంటే అధికం అవుచావి। సమరసానుభవము కలవారు సర్పాలకు తొలగినట్లు తొలగుతారు। మాకంటే అధికులు లేరని తాత్పర్యం। వారికి పశువులకు యెక్కువ తక్కువ లేదు। వ్యాఘ్రాలస్వభావం। సమరసానుభవము లేని దోషం। అందుకే కేవలం శాస్త్రజన్యం పనికిరాదు। గురుకుల వాసం దొడ్డది అని ప్రసిద్ధి।యెందు కొరకు అంటే సమరసానుభవం కొరకు। మాకుతెల్యదా అని కోపగిస్తారు। అడిగితె ఆశలేదు। వారి ప్రభావం చెప్ప శక్యం కాదు। సమరసానుభవం దుర్లభం। ప్రయత్న పూర్వకంగా అది సంపాదించవలె। ఆత్మానాత్మవివేకం గలవారు జ్ఞాన లక్షణం చాత వున్నారు। అదే జ్ఞానముద్రల వంటిదే యిది। అన్ని ముద్రల వంటిదె జ్ఞానముద్ర। మహావాక్యార్థజ్ఞానం మోక్ష సాధనమని ప్రసిద్ధం వున్నాది। "సాధన పరతంత్రహి"। అసాధ్యం। జ్ఞానానకు పుట్టుకా వున్నాది "సాత్వం సంజాయతే జ్ఞానం" అనివాక్యం వున్నది। "జ్ఞానం స్వయంనశ్యతే। జలకతక రేణువత్ "। అని ఆచార్య స్వాములవారు నష్టం అని అన్నారు। పుట్టనిది ఆత్మా అని భగవానులు రెండో అధ్యాయములోనే పలికినారు। పుట్టనిది చావనిది గనుక జగత్తు అని చెప్పరాదు। క్షేత్రజ్ఞస్వరూపమైన జీవాఖ్య పరాప్రకృతి అని చెప్పరాదు। ఉపాధిద్వయ దోషం వున్నదో లేదో। పుట్టనిదే సర్వం। పుట్టనిదే అంతా। విత్తనము లేని చెట్టు వున్నదని యెవ్వరు చెప్పరు। కారణం లేక కార్యం ఎలాగు వుండీనీ। అప్పైతె బ్రహ్మ జగత్కారణం। అని శృతి స్మృతి అనే సూత్రాల చాత క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూప వుపాధి ద్వయ దోషమే చెప్పింది। పుట్టనిది యెలాగు చెప్పుచుంది అదె అంతా। యెవ్వరితోటి ఏమని చెప్ప। చెప్పితె జ్ఞానం చాత గుర్తెరిగే చెప్పవలె। అజ్ఞానం చాత చెప్పక పోవలె। పుట్టని చావనిది అజ్ఞానమా జ్ఞానమా। పుట్టని చావని దాని పేరు ఏమీదాని జాడ యేష్వంటిది। వేదశాస్త్ర పురాణాలు దాని జాడ యెర్గునా యెర్గవా ? పుట్టని దాని కంటే మరివొఘటి వున్నదా లేదా। యెవ్వరు నిర్ణయము చేసేటి కర్తలు। అందరిని అడివిలో కల్పినారు। ఆచార్యస్వాములవారు యిది వున్నది యిదిలేదని నిర్ణయము చేస్తే। యెవరు సుఖదుఃఖ రహితులు అయ్యినారు। పుట్టనిచావనిదే అంతా అని యెవ్వరు యెరుగరు।

**"సర్వశూన్యం నిరాలంబం। తద్విష్ణో పరమంపదం**
**తద్విష్ణం పరమంపదం। సదాపశ్యంతి సూరశయ"**

**చిజ్జదా వాంతు యోద్రష్టాసోశృతి మితిశృతే। యత్రనాన్యత్పశ్యతి। నాన్యశృణోతి। తద్విజానీతి సభూమః।** మృతం లేనిది। **యత్ర నాన్యత్పశ్యతి నశృణోతి తస్య। ద్విజానాతి తదల్పం।** అల్ప మనగా లేని మాయ। లేనే లేదు। **బ్రహ్మసత్యం జగన్మిద్యా। అయం ప్రపంచం మిధ్యేవ। సత్యం బ్రహ్మ జగన్మాయేవ। సర్వం మిధ్యా మనః కల్పిదం।** లేని మాయా మిధ్య లేని ప్రపంచమే మిధ్య।

**శ్రీపూర్ణ ప్రకాశచరణారవిందార్పణమస్తు।**
**వ్రాతప్రతి నుంచి సేకరణ**
**శ్రీ సమిష్టిబోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి**
**మందిర అధ్యక్షులు**



# శ్రీ శ్రీధరుల వారి జీవిత చరిత్ర క్రీ.శ. 1580 - 1651

**శ్రీ శ్రీ శ్రీ శ్రీధర స్వామి నార్ఝుర్‌కర్ మహారాజ్** (మానదేశ్) జిల్లా షోలాపూర్,తా॥ సాంఘోలా. నార్ఝుర్ గ్రామం. క్రీ.శ. 1580 సం॥రములో, **శ్రీ బ్రాహ్మజీ పంత్,** సావిత్రిగారలకు జన్మించారు. వీరి తాత **శ్రీ దత్తానంద్,** పినతండ్రి **శ్రీ రంగనాథ్ మహారాజ్** నిగడికర్.

పండరీపురంలో తండ్రి ద్వారా, **అమరకోశము, షట్ శాస్త్రములు, నిఘంటు వేద, ముఖోదగత్, నాల్గువేదాలు, పదునెనిమిది పురాణములు, నృత్య, శిల్ప, సంగీత, రాజనీతి మరియు** సమగ్ర ప్రాకృతి (సాహిత్యం) **వాఙ్మయములో అధిక వ్యాసంగములును అభ్యసించినాడు.** వీరిని తమ తండ్రి మహాగొప్ప పండితునిగా తీర్చిదిద్దినారు.

శ్రీధరుల యొక్క ధర్మపత్ని పార్వతితో గృహస్థాశ్రమము స్వీకరించారు. వీరలకు ఇద్దరు కుమారులు. వీరి పేర్లు **దత్తాత్రేయ, మనోహర అనువారు.**

**శ్రీధరస్వామి నార్ఝుర్‌కర్** గారి గ్రంథరచనలు

**1).హరివిజయ్ 8139, 2). రామవిజయము 9147, 3). వేదాంత సూర్య ముఖ్య** గ్రంథం, **4). పాండవ్** ప్రతాప్ **13,397, 5).** జైమిని **అటవ్‌మేఘ్- 9876, 6).** శివలీలామృత్ **2470, 7). పాండురంగ మహాత్మ్యం 748, 8). శ్రీ** వేంకటేశ్ మహాత్మ్యం **650, 9.)** మల్లారి మహాత్మ్యం **355, 10).** జ్ఞానేశ్వరీ చరిత్ర **300, 11). రుక్మిణి స్వయంవర్ 413, 12). భామా వినోద, తదితర్** పద్యములు **10,342** మొత్తం **55,817, వీరి వాఙ్మయము మరాఠి భాష లోనే రచించిరి.**

**శివలీలామృత** గ్రంథము, **వీరశైవమ్ వారి ధర్మ గ్రంథముగా నిలచియున్నది.** మిగత గ్రంథములన్నియు అత్యంత రసభరితమైనవి. వీరి యొక్క పాండిత్యమునకు మెచ్చి, **'శాహు మహారాజుగారు" 'టాకళి'** గ్రామమును బహుమానంగా ఇచ్చిరి.

ఆనంద శిష్య సాంప్రదాయము (పూర్ణప్రకాశ గురు సాంప్రదాయం) శ్రీమన్నారాయణ పరంపర నుండి శ్రీ శ్రీధరులకు పై సాంప్రదాయకులుగా వచ్చిరి. వీరి శిష్యులలో ముఖ్యులు **శ్రీమాన్‌పూరి గోసావి. శ్రీ శివరామ దీక్షితులు, శ్రీ ఏక్‌నాథ్, శ్రీ మధ్యమునీశ్వర్, శ్రీ సామ్‌రాజ్** అనువారలు. వీరి జీవితం అతిశయ శుద్ధమైనది. మరియు ధార్మికులుగా యుండిరి. తల్లిదండ్రులు ధర్మ పారాయణులుగా వుండిరి. వీరు చెప్పినదే తు.చ. తప్పకుండ చేయుచుండెడివారు. (బోలేతైసా చాలె)

వీరి పూర్వికులు ఔరంగబాద్. ఇది అప్పటిలో **'ఖఢ్‌కి'** లో యుండేది. అందుచేత వారి ఇంటిపేరు **'ఖడ్‌కె'** అయినాది. తరువాత వారు బీజాపూర్ ధర్బార్‌కు వచ్చి, అక్కడ అశ్వ పరీక్షకులుగా వుండిరి. అందువలన వారి ఇంటిపేరు **'ఘోడకేగా'** మారినది. తదనంతరం శిపాయిగా చేరిరి. మరియు తరువాత కీర్తనలు, ప్రవచనములు, భజనలు, చేయుచు వచ్చిరి. వీరి జీవిత కాలం ఎక్కువ పండరిపురంలోని విఠలేశ్వరుని వద్ద భక్తితో పూజిస్తూ గడిపినారు. అతని భార్య యొక్క విద్యాభ్యాసం కూడా తమ తండ్రి యొక్క ఆధ్వర్యములోనే జరిగినది.

వీరి పినతండ్రి **రంగనాథ్ స్వామి సమర్థ రామదాసుగారి శిష్యులుగా యుండిరి.** అతను గొప్ప సత్పురుషులు. పినతండ్రి శ్రీధరుల వారిని విశిష్ఠ ముహూర్తములో పండిరిపురమునకు తనతో పాటు తీసుకొనిపోయిరి. అక్కడ జయరామ్ స్వామిసమర్థులు యుండిరి.

**రంగనాథ్ స్వామి** గారికి ఒకానొక సమయమున కీర్తన చేయడానికి ఆలస్యము అయినందున 'ఆసమయంలో **రామదాసుస్వామి** గారు శ్రీధర్‌స్వామిగారిని కీర్తన పాడుమని సెలవిచ్చారు. అప్పుడు **శ్రీధరులు** ఏడ్చుకుంటూ శ్రీరంగనాథ్ స్వామి దగ్గరకు వెళ్ళినాడు. కీర్తన చేయడానికి నాకు రాదన్నారు. అప్పటినుండి **(ఖంద్యాచా శ్రీధర్ ఝాతా) శ్రీధరులుగా మారినారు.** ఈ విధముగా దంత పిడాన, పిడుకథ వాడుకలో యున్నది. అది దంత కథ సత్యంగా అయినాది. నిజంగానే శ్రీ శ్రీధరస్వాముల వారి నాలుకపైన సరస్వతి యుండెను. ఇది అతని యొక్క వాఙ్మయ గ్రంథములో యున్నది.

వీరి వ్యాసంగములు చాలయున్నవి. **అతని హస్త లిఖిత గ్రంథ సంగ్రహములు 28. ఇవి మరాఠి భాషలోను, 12 సంస్కృత భాషలోను మొత్తం 40 గ్రంథములు వ్రాసిరి.**

**అమరకోశం ఏకాశరీకోశ్, నిఘంటు సిద్ధాంత కౌముది, షట్ శాస్త్రములు 16 సంస్కార పండిత సాహిత్యములు, చతుర్ వేదములు ఇవన్నియు వీరి నోటిమీద అభ్యాసం యుండెను. మరియు ఉపనిషత్తులు, పంచమహాకావ్యములు నృత్యం, శిల్ప, వ్యాకరణ, బ్రహ్మసూత్రములు, శిక్షా అనునవి వందల కొలది గ్రంథములు ఎన్నియో అధ్యయనము చేశారు. మొత్తం కావ్య రచనలు ఒక లక్ష ఇరువది వేలకు పైగా అని అతని కుమారుడు దత్తాత్రేయ మంగళ హారతి పాటలో సవాలక్ష అని చెప్పియుండిరి.**

ప్రస్తుత **కావ్య సంపద లెక్కపెడితే 57,817 యున్నవని తెలియచున్నది. మరియు హరివిజయ్, రామవిజ[illegible], పాండవ ప్రతాప్, వేదాంత సూర్య, శివలిలామృతములనునవి పెద్ద గ్రంథములు. పాండవ ప్రతాప్ అతిపెద్ద గ్రంథం 13,397 ఓవీలు గలవి.** ఇవిగాక స్ఫుట రచనలు కూడా చాలాయున్నవి. అతని కావ్యములన్నియు సులభశైలిలో, చిన్న పిల్లలకు కూడా అర్థమయ్యేలాగునయున్నవి. మృధుమధురమైన పదములతోను, భావమును అత్యంత ఆకర్షనీయంగాను రచించారు. చరిత్రలల్లో యుద్ధము యొక్క వర్ణనములు, వీరత్వమును కన్నులకు కట్టినట్లుగా వర్ణించారు. రాసక్రియల వర్ణనములు, భక్తి రసం యొక్క వర్ణనములు, శృంగారము, అలంకారములతో రచనశైలి కురిపించారు. వీటికి తోడు దృష్టాంతములతోజతపరిచారు.

వీరి యొక్క శిష్యులు శ్రీమాన్‌పూరి గోసావి గారు శ్రీధరుల యొక్క వాణి రసవంత భరితమై యున్నవి. అతని సుందర రూపము ఈ విధంగా యున్నదని తెలియుచున్నది. అతని వెంట్రుకలు ఒత్తుగాను, ఆకాశ నియమితమైన నేత్రములు, విశాలమైన దయ, గోధుమ రంగు పీతాంబరం ధరించువారు. నోసట కస్తూరి తిలకం, తలపై పాగ రూమాల్ ఈ విధంగా రమణీయంగా యుండేవారు.

సంత్ ఏకనాథ్ మహారాజ్ లాగానే అతని యొక్క గృహస్థాశ్రమము ఎంతో సుఖసంతోషాలతో సంపన్నులుగా యుండిరి. వీరి కుమారులు వీరికి అనుగుణంగా నడుచుకోనెవారు. భార్య ప్రతివ్రత. ధర్మ పరాయణులు. కీర్తనలు పాడుకొంటూ, ఇంటి పనులను చక్కదిద్దుకొనేది. వీరు గృహస్థులుగా యుండినను ఎల్లప్పుడు సన్యాసిగానే యుండెవారు.

**"శాహు రాజుగారు" టాకళి గ్రామమును బహుమానంగా ఇచ్చిన చోటనే శిష్య పరిగణముతో యుండెవారలు. శిష్య గణము చాలా పెద్దదిగా యుండెను. అందు 1. శ్రీ శివరామదీక్షితులు 2. శ్రీమాన్‌పూరి గోసావి గారు 3. సామ్‌రాజ్, 4. మధ్యమునీశ్వర్ తదితరులు శిష్యులలో ముఖ్యులుగా యుండిరి.**

**వీరు విఠలేశ్వర మందిరములో కీర్తనలు చేసేవారు. వీరు ఆలయమునకు వచ్చే వరకు అర్చకులు (పూజారులు) ఎదురుచూస్తు యుండేవారు. వీరి మంగళహారతితో సమాప్తి చేయుచుండెడివారు. ప్రస్తుతం రుక్మిణి మందిరములో శ్రీధరుని కీర్తనలు ఇప్పటికి పాడుచున్నారు. మంగళహారతులు కూడా కొనసాగిస్తుయున్నారు.**

**క్రీ.శ. 1640 మధ్య బారామతిలో** నివశిస్తున్నప్పుడు **'శివాలీలమృతం'** రచించాడు. మరియు 1640 నుండి 1651 వరకు రచనలు నిలిపి భగవంతుని చింతనలో గడిపినారు.

**క్రీ.శ.1651 మాఘ మాస బహు తదియ ఉత్తరాయణం** బ్రహ్మ ముహూర్త సమయము **అనగా ఉదయం నందున మహానిర్యాణము పొందారు.** మృదంగ వాయిద్యములతోను హరినామ సంకీర్తన స్మరణలతో అతని అంతిమ యాత్ర జరిగినది. పండరిపురంలో చంద్రభాగనది ఒడ్డున **కుంభార్ ఘాట్‌లో** అతనికి అగ్ని సంస్కారం చేయనైనది. మూడవ రోజు ఒక వింత జరిగినది. **అతని చితాభస్మమును ఎత్తునపుడు అందులో నుండి దండ కమండాలాలు వెళ్లినవి. ఇవి ఇప్పటికి భద్రంగా వారి వంశజుల దగ్గర యున్నవి.** ఈ సమాధి **కుంభార్ ఘాట్‌లో** కలదు. పండరిపూర్ పాండురంగని ఆలయ వెనుక భాగం నందు ప్రక్కవీధిలో వీరి స్వగృహము ఇప్పటి వరకు యున్నది. మరియు వారు ధరించిన పాదుకలు కూడా యున్నవి. ప్రస్తుతము **వీరి వంశజులు తుకారామశాస్త్రి నార్ఘురెకర్, నారాయణశాస్త్రి నార్ఘురెకర్, గోవిందరావు నార్ఘురెకర్ యున్నారు.**

**శ్రీ శివరామ దీక్షితులు దశగ్రంథ బ్రాహ్మణులుగా యుండిరి.** అతడు సర్వక్షేత్రములకు వెళ్లి వాద వివాదములు చేసేవారు. అనేకమైన పండితులను ఓడించి జయ పత్రములను తీసుకుంటూ పండరి పురములోనికి వచ్చినారు. **పండరీపుర క్షేత్రమున, శ్రీధరులతో వాద వివాదమును చేసే ప్రయత్నాలు చేసాడు.** శ్రీధరులు నైష్కర్మలో యున్నందున వివాదమునకు మానుకొని మీతో వివాదము చేయను, కాని జయపత్రము ఇవ్వమన్నాడు. **అప్పుడు శ్రీధరులు యీ విధంగా అన్నాడు. నేను వ్రాసే కలం, శ్రీ విఠలేశ్వరుని చరణముల యందు పెట్టినందున జయపత్రము వ్రాయలేను.** దీక్షితుల వారు అట్టి మాటను పెడచెవిన పెట్టి, పత్రము ఇవ్వమని మరి మరి అడిగారు. **అప్పుడు శ్రీధరుల కుమారుడు దత్తాత్రేయుడు వచ్చాడు. అతని వయస్సు 4 సంవత్సరములవాడు వాదించాడానికి ముందుకు వచ్చినాడు. దీక్షితుల వారి ప్రశ్నలన్నిటిని ఖండించాడు.** అందుకు ఆశ్చర్యచకితుడై నీకి జ్ఞానము యింత చిన్నతనములో ఎలా వచ్చిందనగా గురువు అజ్ఞతో మీతో వాదించానని చెప్పాడు. **దీక్షితుల వారు చేయునది లేక జయపత్రములన్నిటిని శ్రీధరుల పాదముల యందు పెట్టి శరణు బొంది త్రికరణ శుద్ధిగా సేవించాడు. అంత శ్రీధరులు అతని భక్తికి మెచ్చి దీక్ష యిచ్చి జేరదీర్చినాడు.** గురువు యొక్క అజ్ఞానుసారము బయలుదేరి సప్త గోదావరి వెళ్ళి తరువాత రాజమహేంద్ర మందు శ్రీధరుల యొక్క మందిరము నిర్మాణము చేయించాడు. శ్రీధరుల సమాప్తి భీమా నది ఒడ్డున నిర్మించాడు అని వారు వ్రాసిన ప్రతి నుండి తెలియబడుచున్నది.

**శ్లో॥ అవలీలం గురోఃపుత్ర త్వమేవ శరణంమమా ।**
**అకారస్య నిరాకారం । నిరాకారం పునఃపునః ।**
**శ్రీకైవల్య పరస్థానం । అవలీలం గురుంభజే ॥**

**కం॥ ఈక్షితి శివరామ హ్వాయ దీక్షితులకు బోధ జేసి దిద్దిన సామ్యౌ ।**
**దక్షుని శ్రీధరమూర్తిని నిక్షేపముగా దలచి నేవినుతింతున్ ॥**



# అచలబోధ తత్వతారావళి

ఇయ్యది శ్రీ సచ్చిదానంద పగడాల వేంకటేశ్వర అవధూత స్వాములవారిచే రచించిపబడినది. దీనిని నుండి 1.సాధన చతుష్టయము2. ఉపదేశము, 3. మంత్రార్థము అనునవి సేకరించి యిందులో ప్రింటు చేయడము జరిగినది.

## సాధన చతుష్టయము

ప॥ బోదాధికారిగావలెను వేద వేదాంతవేత్త గావలెనూ

1. సాధన చతుష్టయమును లెస్స సాధించి పద్ధతి సద్గురుని వలెను
   మోదముతో తెలియవలెను మంచి సాధుల సాంగత్యం సలుపగ వలెను ॥ బో ॥
2. సత్యము బయలనవలెను అసత్యము మాయాజగత్తన వలెను
   నిత్యము యిట్లెరుగవలెను. నిర్ణయజ్ఞానమున నిలచుండ వలెను ॥ బో ॥
3. పరమ వైరాగ్యముతోను ఇహపర భోగములాను బాయంగ వలెన్
   మరియు నింద్రియాములా మట్టిమర్ధించిభాగాదిమమత విడువ వలెను ॥ బో ॥
4. సమరసస్థితి జెందవలెను మదిలో సద్గురుభక్తీ సదా
   క్రమముతో యోగములానుజేసి శ్రమపడి జ్ఞానముజెందవలెను ॥ బో ॥
5. ఇతరాపేక్షలు విడువవలెను సమ్మతముతొడుత మోక్షస్థితి జెందగ వలెను
   మది నిలకడ గావలెను । శ్రీయఃపతి వేంకటేశ్వర ప్రభుకృప వలెను ॥ బో ॥

## 2. ఉపదేశము

ప॥ఉపదేశము జేసెరా సద్గురురాయుడుపదేశము ॥ జేసెరా॥

1. ఉపదేశము జెసె నవరాధి యగువా
   ఉపచారములు మెచ్చి కృపతో కేవలాత్మ॥ ఉప ॥
2. ఏ సాధనలు శాస్త్రాలెందుకు విడువుమని
   బాసజేయించియు పరమ దయతోను ॥ ఉప ॥
3. పాదరేణువ నుదుట నాధారముగ నుంచి
   మోదముతో దీర్ఘప్రసాదము నొసగియు॥ ఉప ॥
4. దీక్షత్రయము యిడి దివ్యముగ శిరసున
   సాక్షిగ చెయ్యుంచి శక్తిపాతము జేసి ॥ ఉప ॥
5. శిరమున చెయ్యుంచి కరుణతొ కుడిచెవిలో
   గురుమంత్రరాజమును గురువాక్యత్రయమును॥ఉప ॥
6. బోదాధికారమగు సాధన చతుష్టయము
   సాధనలు దెలపి సాధుమూర్తిగ జేసి ॥ ఉప ॥
7. దృష్టదాష్టాంతముచే నిష్టసల్పుమని
   శ్రేష్ఠముగ ద్వాదశి షోడశి మంత్రములు॥ ఉప ॥
8. వరనందననామ వత్సర శ్రీ చైత్ర ।
   పరిశుద్ధ పూర్ణిమలో పరిపూర్ణబోధను ॥ ఉప ॥
9. శంకలేకను యిట్లు సద్గురు లక్ష్మణులు
   వేంకటేశ్వరునికి వేదాంత సిద్ధాంతం ॥ ఉపదేశము ॥

## 3. మంత్రార్థము

1. ద్వాదశి షోడశి మంత్రార్థంబును తరచుచునుంటె మేలుగదా ।
   సాధన లేని అచలబోధను సంగ్రహించితె చాలుగదా ॥

2. ఎరుకవృష్టికి ముందు వెనుకను ఏమిలేకను యుండెగదా ।
   ఎరుకపుట్టి పరిపూర్ణంబని పేరు ఏర్పరించి తానేగుగదా ॥

3. గురిగా విను యీ ఉత్తది యనునది పరికించగ భ్రమలేందిగదా ।
   ఎరుగుము బట్టబయలు శరీరము ఏమిలేనిది ఎరుకగదా ॥

4. ఘటములో ఉత్తది లోనిబయలు ఘటమావల వెలిబయలు గదా ।
   పటుతర బట్టబయలేమిలేదు పగిలితే నిర్భయులైనేసదా ॥

5. తరచగ బట్టబయలు తప్ప యీ తనువు జగములు లేవుగదా ।
   ఎరుగుమట్ల యీ ఉత్తబయలు ఏమిలేదుయని అనిరిగదా ॥

6. ఆది అంత్యములేని ఎరుకయిది అగుపడి యగుపడుకుండు గదా ।
   నాది నేను యనువదు మంత్రంబున నటియించుచుండె దిదేగదా ॥

7. గాఢానిద్రలో తనకు తానెరుక కలుగుట మూలము లేందిగదా ।
   గాఢానిద్రయు మేల్కతోనుండి కలిగితే ఏమియు లేదుగదా ॥

8. కలలో వచ్చిపోయిన జగమువలెను గుర్తెరిగె తనువుగదా ।
   కళిక కర్పూరము కలసినట్లుగా కనబడదు యీ యెరుకగదా ॥

9. తరచగ మూలములేనిది యనగా తనకుతాను సృష్టాయగదా ।
   గురుతు ఎరిగె శరీరంబనగా ఎరుగుము తాడులో పాముగదా ॥

10. ఏమిలేదు యన కలమేల్కనగా ఎరుక లింగములు లేవుగదా ।
    ఈ మూలంలేని గుర్తెరిగె తను వేమిలేదు యికసరే కదా ॥

11. పరిపూర్ణంబును ఎరుకను ఎరిగె విడచితె హాయిగదా ।
    పరిపూర్ణాచలబోధను ఆర్యులు ప్రచురపరచిరి యిదే గదా ॥

12. చక్కగ బృహద్వాశిష్టంబును చదివితె మీకు తెలుసు గదా ।
    మక్కువతో కందార్థముల్ వింటే మాయాభ్రాంతులు తొలగుగదా ॥

13. స్థిరముగ ఫీల్ఖాన లక్ష్మణ గురువరు దెరిగించిన బోధిదేగదా ।
    పరమభక్తితో వేంకటేశ్వరుడు ఎరిగి కృతార్థుండాయెగదా ॥ ద్వా ॥



# భ్రాంతి రహితాచలానుభవమును పాంచభౌతిక రహితము

అను గ్రంథమును శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువుల వారి ప్రియశిష్యులగు శ్రీ కూనపురి రాజారాం రాజయోగి గారిచే రచింపబడినది. ఇందులో నుండి 39వ తత్వము మరియు 7 కందార్థములను ప్రింటు చేయుచున్నాము.

## తత్వము

1. ఫీలుఖానా లక్ష్మణార్యులే మనకీలు దెల్పుగురుస్వాములే, చాలుచాలు ।
   యిలభోగమొదలీ దేహమూలము లేనిదాని చాలగా నరయుమానెనే ॥ ఫీ ॥

2. భూతిఫాలామందు నుంచెనే స్వామి ధాత వ్రాతనీకూ దెల్పెనే ।
   పాతకములు బాపి ఖ్యాతిగా నాలో కోతిపై వెలిగేటీ జ్యోతిని రహిత మనెనే ॥ ఫీ ॥

3. అండాపిండములాను నిండెనే బ్రహ్మాండ భాండములాను చెండెనే ।
   పండువెన్నెల మీరి దండిగా గనుపడుచు నుండు బయలులో నీవు లేవని చెప్పెనే ॥ ఫీ ॥

4. ముట్టూ మూత్రములకొంపానే స్వామి గుట్టు దెలిసి ముట్టుకొనకానే ।
   పుట్టుగిట్టుకు చాలగాను దిట్టమైయున్నదీ యేటిగట్టు మానుసాటిదీ వినుమా నెనే ॥ ఫీ ॥

5. ద్వాదశాక్షరనే మంత్రామే స్వామివాద ముడిగీ వినుమనెనే ।
   వేద శాస్త్రము పాదుగానిది షోడశాక్షరి లేదు లేదానెనే ॥ ఫీ ॥

6. నిమిషము నెడబాయకున్నాడే స్వామి హింసదీర్చి నేలుకున్నాడే ।
   నిమిష కవిరాజరామ నీలోవెలి సమముగా నచలము సాధానా యిదె యానెనే ॥ పీ ॥

## కందార్థములు

1. వింటిని మీ మృదువాక్యము । కంటిని తమకంటిసంజ్ఞ. గెంటితి నెరుకన్ । మింటికి మంటికి మీరియు । నొంటరియైయున్న బట్టబయలూగా గంటి । శ్రీలక్ష్మణార్యుల పల్కాలించుంటీ । తుంటారియీా యెరుక నంటినంటని గురుని । వెంటానుండీకొల్చి తంటావదలిబట్ట ॥ బయలూగా గంటి శ్రీలక్ష్మణార్యుల పల్కిలించుంటి॥

2. ఎందుకురా యీా దేహము । నందదు వైకుంఠమునకు బొందకె । గానీ । నిందలబడి తుదకును యమ । బంధములో బడియు బొందీ పోతుందిగనరా। సుందరమయిన దచలామిదుగోర । మందామతివై నీవూ యిందూవదనల పొందు । జెంది పరవశుడావై సంధీ దెలియగ లేవు । సుందరంబగు గురుని పాదారిందములు నానందమూగని దెందమందున నంది । పొందుము ద్వాదశి గనుము షోడశి ॥ పోతుందిగనరా సుందరమయిన । అచలా మిదిగోరా ॥

3. యెరుకే సుమి ఓంకారము । యెరుకేసుమి । నాదబిందు యెరుకే కళయన్ । యెరుకేసుమి నేన్ మేనులు । యెరుక సుమీ యింద్రజాల మిహపరములురా । లేనివాని మదినమ్ముకోర । యెరుకే పాపము పుణ్యమెరుకే । సుఖదుఃఖములు యెరుకే । జననామరణ మెరుకే యిన్నీ రీతు ॥ లిహపరములురా । లేనివాని మది నమ్ముకోరా॥

4. యేమీ లేనీ బయలున । భూమ్యాకాశంబు వాయునగ్నియు జలమున్ । కామాది గుణ సమూహము । యేమాయయు బుట్టలేదు । యిక బుట్టబోదు। బుట్టేనన్మాటది నమ్మరాదు । వేమారకను గురుని ప్రేమాతొ సేవించు । భూమానందుని చేయు భూమిపై నీజన్మ ॥ మిక బుట్టబోదు । బుట్టెనన్మాటది నమ్మరాదు ॥

5. కేవల అచలాత్మందున । దేవతలగు బ్రహ్మవిష్ణురుద్రాదిశివుల్ । స్థావర జంగమ మాదిగ । భావింపుము లేనివని నీ భ్రాంతి నొదులోయి । వదలిన భ్రాంతి మది దల్వకోయి । భ్రమరహితమైన యీబయలే స్థిరమని యెరుక అవనీ స్వప్నావస్థయని తెలియు మిప్పుడు ॥ భ్రాంతి నొదులోయి । వదలి నీభ్రాంతి మది దల్వకోయి ॥

6. ఎప్పటికి నుండు బయలున । యెప్పుడు లేనట్టి యెరుక యే తెంచుటమున్ । తప్పున తనకై తాకను । ముప్పుసుమీ యెరుక పొందూ తప్పుకోవోయి । చప్పున లేంది అప్పా గనవోయి । గొప్పాకొంచే మనక యెప్పుడేమియుగాక। ఒప్పిదామైయున్నా చొప్పు దెలసీ మాయ ॥ తప్పుకోవోయి । చప్పుదూ లేంది అప్పా గనవోయి ॥

7. బోధ సుమీ ద్వాదశియది । మేధసుమీ సాధువులకు మేదిని లోనన్ । రాదుసుమీ యికజన్మము । లేదు సుమీ యెరుకమూల మిది నిశ్చయమురా లేందే యెరుక లేదు లేదనరా । ఖేదా మోదము లేని వాదాభేదము గాని। వేదాసారాతీతా సాధాననేమియు లేని ॥ యిది నిశ్చయమురా । లేందేయెరుకా లేదు లేదనరా ॥

---

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

కొలువైయ్యున్నారే । శ్రీ కృష్ణగురుదు । కొలువైయ్యున్నారే ॥ ప ॥

కొలువై య్యున్నారే యీయిల పామరుల నేల । సలలితముగ వారు సంపూర్ణ దయదల్చి ॥ 1 ॥

భక్తాబృందము జేరి బ్రస్తూతింపుచు నుండ । ముక్తిదానం బొసగి ముదామూన పోషింప ॥ 2 ॥

కోటిబాస్కరులా మించిన కిరీటము దాల్చి । బోటూలందరు గూడిపాటాలు బాడాగ ॥ 3 ॥

సురగణము నేతేరగరు డోరగులు గొల్వ । పరమా నందముతోను పరిపూర్ణమును దెల్ప ॥ 4 ॥

జ్ఞానా కర్మములూను గానీ వస్తువ సౌజ్ఞ పూనీచేశినాదు పుట్టూ గిట్టుట లణచ ॥ 5 ॥

ఆనందరహితామౌ అచల మిదుగొ యానిమానాక నెరిగించి మర్మాము వినుపించ ॥ 6 ॥

పన్నెండక్షరమూలు తిన్నాగ పఠియించు । వన్నే చీన్నేలుగల్గు వర షోడశిదె యాని ॥ 7 ॥

శ్రీ భాగవతకృష్ణ శ్రీ దేశికోత్తములు । భూబాగ మందూ లక్ష్మణ దాస వరయూమన ॥ 8 ॥



# పరిపూర్ణ బోధ సీసమాలిక

పెద్దల గ్రంధములలోని కొన్ని ముఖ్యములైన తత్వములు-కందార్థములు -పద్యములు ఈ శతవార్షికోత్సవ సంచికలో ప్రింటు చేయుచున్నాము. ఎందుచేతననగా అట్టి గ్రంధములు ప్రస్తుతము ప్రింటులో లేనందున వాటిని సేకరించి ఇచ్చోటను వేయుచున్నాము.

**పరిపూర్ణ బోధసీసమాలిక** అను గ్రంధం శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభువుల వారి శిష్య రత్నంబగు పసుపులేటి రామస్వామి గారిచే 1947 సం॥రములో రచించి ప్రింటు చేయబడినది. ఇందులో నుండి 1. శిష్యుని మొర 2. గురునివాక్యం 3. అచల లక్షణము అనునవి ఇచ్చోట ప్రింటు చేయబడినవి.

## 1. శిష్యుని మొర

అట్టి శిష్యాగ్రణి । అచలగురుని జూచి
రయమున భక్తితో । వాడుపలికె ।
తల్లివి తండ్రివి । దాతవు దైవము
సర్వము నీవేను । సార్వభౌమ ।
లక్షయెనుబడి నా । ల్గోయోనుల జనించి
చాలాయెనుబ్రతుకు । చాలుగాదె ।
మఱి పుట్టుకలు లేని । మార్గము జగతిలో
అదియేదో నడువుడు । ఆర్యులార ।

## 2. గురుని వాక్యము

అంతటను గురుండు । అచలుండు కరుణతో
రయమున జేరగ । రమ్ము లెమ్ము ।
భయమును వీడుము । భ్రాంతిని జిమ్మెద
సాధనలేదుర । శంకవలదు ।
సనకస నందన । సాందీప కృష్ణుల
బోధ మూఢులకైతె । భువిని గాధ ।
కాశిపోయిన । కర్మమును తీరదు
అరయుము విడువక । అచలబోధ ।
సంపద రాన్పోని । చక్కగజేపట్టు
కడుదుస్తరము మఱి । కాదురాదు ।
ఉన్నది యొక్కటి । ఉండగలేనిది
యొక్కటి చూచితే । యొకటె యొకటి ।
ఉన్నది చూడగా । ఉండగ లేనిది
హుళ్ళక్కగు కనుమీ । శుద్ధబోధ ।
ఎపుడస్తి యచలంబు । ఎపుడు నాస్తియెరుక
గురువుచే దెలియుము । గోప్యమదియె ।
గురువాక్య మందున । గురుబోధ యందున
పరగ చవియు లేమి । పాపమదియె ।
అరియుము గురువుల । హరిహర విదియందు
నగురోరధిక మంచు । నభవుపాటు ।
ఇది మేవ శివమంచు । ఇల విష్ణు శాసించు ।
ఆర్యులు పరబ్రహ్మ । మంచుగాంచు ॥

## 3. అచల లక్షణం

సకల దేశములందు । సమబట్ట బయలుగా
అపరిచ్ఛినముగాను । అచలముండు ।
సకలకాలములందు । సమబట్టబయలుగా
అపరిచ్ఛిన్నముగాను । అచలముండు ।
సకల వస్తువులందు । సమబట్టబయలుగా
అపరిచ్ఛిన్నముగాను । అచలముండు ।
ఆవర్ణమాకశం । ఆవర్ణరహితంబు
బట్టబయలనంగ । బరుగు భువిలో ।
నాద కళాబిందు । నయముగ వీటిని
మీరిన దచలంబు । మెప్పుచుండు ।
ఆకాశ మవకాశ । శమన శబ్ద నిశ్శబ్ద
మాకాశమన, యొక్క । టౌనుభువిని ।
శబ్ద నిశ్శబ్దమౌ । సరగున నిశ్శబ్ద
మగుశబ్దం బివిమీరి । అచలముండు ।
సత్యమై నిత్యమై । స్వచ్ఛమై శుద్ధమై ।
ప్రతిలేక నుండును । బట్టబయలు ।

క్షరమక్షరంబును । కారణకార్యము
పరజీవ శివులేని । బట్టబయలు ।
సగుణ నిర్గుణములు । సదసత్తులు చిద్రూపు
ప్రకృతి పురుషుకాని । బట్టబయలు ।
జాతి బేధంబులు । చర్చించ మతములు
ప్రకృతి వాదములేని । బట్టబయలు ।
అహమును క్రియలును । అవని ముమ్మలములు
బంధమోక్షము లేని । బట్టబయలు।
గురుశిష్యులును వారి । గురుబోధవాదముల్
పరగ గుర్తులు లేని । బట్టబయలు ।

జ్ఞానత్వ కర్తృత్వ । శత్తృత్వ భోక్తృత్వ
కించిత్తు కలుగని । కేవలాత్మ ।
నిరవయ నిస్సంగ । నిరుపమ నిర్గుణ
క్రియలేవి లేనిది । కేవలాత్మ ।
అమలమై స్వచ్ఛమై । అచలమై విమలమై
క్షేత్రజ్ఞులును లేని కేవలాత్మ ।
పంచభూతములచే । పంచతనొందదు ।
క్రీడ బాధలు లేని । కేవలాత్మ ।
ధరశాశ్విత పురాణ । తగసనాతనమగు
పరగ భూమననొప్పు । బట్టబయలు ॥

## ఆత్మారామ శతకము శ్రీ గురుబోధస్తము మరియు తత్వరాజము

అను గ్రంధము కూడా పసుపులేటి రామస్వామి (స్వామిరామత్యాగి) గారిచే రచింపబడినది. ఇది 1949 సం॥రములో ప్రింటు చేయబడినది. ఇందులో నుండి 1. పరిపూర్ణము 5 పద్యములను2. పరిపూర్ణ బోధ 15 పద్యములు ఇక్కడ ప్రింటు చేయడము జరిగినది.

### 1. పరిపూర్ణము

1. ఆ. వె॥ "ఏకమేక మేవ" । ఏకైక పూర్ణంబు
పూర్ణతత్వమె పరి । పూర్ణమగును
పూర్ణమద్వితీయ । పూతమౌ పూర్ణంబు
అరయు పూర్ణ తత్వ మాత్మరామ ॥

2. ఆ.వె ॥ ధ్వనిలేనిచోటు । తనరు బట్టబయలు
పృధివి లేనిచోటు । బట్టబయలు
ఒరులు లేనిచోటు । ఉత్తబట్టబయలు
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

3. ఆ.వె. ॥ దేహమందు నుండు । దేహంబు లేనిది
అదియె బట్టబయలు । అదియె కేవ
లాత్మ అరయనదియె । ఆత్మ విచారంబు
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

4. ఆ.వె॥ పలుకంజీవు వెనుకం।బ్రత్యగాత్మయు నుండు
పరగ ఈశు వెనుకం । బరమయాత్మ
ప్రత్యగ పరమాత్మం । బరమౌను కేవ్లాత్మ
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

5. ఆ.వె ॥ చూడు ముల్లుగుచ్చ । చోటులేదు యనగ
జగము కొంచముండ । జాగలేదు
పరగ యద్వితీయ । పరిపూర్ణమే యుండు
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

### 2. పూర్ణబోధ

1. ఆ.వె॥ లేదు లేదుయనగ । లేకపోదు నిజము
ఉండునుండు నన్న । నుండదు మృష
రెండునిలం దెలియని । వెధవ నిక్కుచు నుండు
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

2. ఆ.వె ॥చూడవాద బేధ । బోధలు జగమున
మనసు సుస్థిరగతి । మలుపంగావ
బోధలోని బోధ । పూర్ణ బోధయుగాదె
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

3. ఆ.వె ॥ఉన్నదున్న దట్లె । ఉన్నది చూడుము
లేనిది కనవలేక । లేదుయనుము
సాధులెపుడుం గనగ । సాధన రహితము
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

4. ఆ.వె ॥వినవె కనవె మనవె । వితమౌ సత్యంబు
మూడు కాలములలో । మొనము నదియు
చలగ విడువు మిథ్య । జగమును నావల
అరయు పూర్ణతత్వ మాత్మరామ ॥

5. ఆ.వె॥ ఉన్న లేదు యనక । నున్నదియచలంబు
ఉన్న లేను యనుచు । నుండు నెరుక
ఉన్నదాన్నింగన్న । యుర్వి యెరుకసున్న
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

6. ఆ.వె॥చెట్టులోని చెట్టు । చెలగఁగల్ప తరువు
పురుషులందుఁబురుష । పుణ్యతముడు
మాటలోని మాట । మతిముక్తి పలుకురా
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

7. ఆ.వె॥పలికితిఁ దెలిసితిని । పరిపూర్ణమును లెస్స
అన్నమాట లెల్ల । అవనిఁగల్ల
ఇలఁనిజ బయలుఁగన ।యెరుక మ్రగ్గను గాదె
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

8. ఆ.వె॥పరగనీవు కనుము । పరిపూర్ణమిదియే
లేని యెరుక యిదియె । లేదు యనుము
ఇదె నిజగురుబోధ । యెక్కడఁ జూడగా
అరయు పూర్ణతత్వ । మాత్మారామ ॥

9. ఆ.వె॥బట్టబయలు యనుచు । పలుకంగ నేలనో
బయలు తప్పవేరు । పలుకులేదు
నీవు యెరుక బయలు । నిర్ణయం వీడరా
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

10. ఆ.వె॥ఉత్తబట్టబైలె । యుండుద్వయముఁ గాక
సురనర నటనక్రియ । చూపులేక
తెలియు "నాస్యపశ్య।తి" శృతి "భూమ" యనగ
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

11. ఆ.వె॥చూడంబడున వెల్ల । సూన్యమగును గాన
చూపులేని దానిఁ । జూడవలయు
చూచు బట్టబయలు । చూడకఁజూడరా
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

12. ఆ.వె॥బోధలోని బోధ । పూర్ణబోధ యనగ
పూర్ణబోధ విన్నఁ । బొందుమేల్క
పరము కాక పరము । పరబ్రహ్మ మగుసుమీ
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

13. ఆ.వె॥అంతబట్ట బయలు । అని వట్టిగ వినుటె
సూది మోపలేదు । చూడ సందు
యనుటె లేని యెరుక । యప్పుడె పోకుంటె
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

14. ఆ.వె॥తనువునందు లేకఁ । దాను నిండినదగు
బయలులోన మతియు । బైట ననక
ఖండమందుఁ జూడ । గనఖండ ముందునె
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

15. ఆ.వె॥బట్టబయలు యనుచు । బైటఁజూచుట నేల
నీతనువులో బయలు । నిండి యుండు
నీకు సూచనైతె । నిల్వగలవె నీవు
అరయు పూర్ణతత్వ । మాత్మరామ ॥

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

శ్రీకృష్ణమూర్తి । భాగవతూల । శ్రీకృష్ణమూర్తి ॥ ప ॥
శ్రీకృష్ణమూర్తినాకీ కాలమందూన । లోకాము లోనా ననేకపాయము గల్గె ॥ 1 ॥
కాలూకలకయు లేచికీళ్లూ నొప్పులుబట్టి । నేలాపై నడుగీడజాల జాలిగాద ॥ 2 ॥
మీగాలుపై వాపు మిక్కిలిగా దోచె । యీగాతి జేయూట యికనీకు మేలౌన ॥3 ॥
దిక్కుమాలిన వాడ మ్రొక్కులిడిన గాని । మక్కువతో నేల వెక్కాసమా నీకు ॥ 4 ॥
కలకంటి యరుకాను యిలలోనమ్మకుమాని । పలుమారు భోధించు పలుకూలేనట్టిది ॥ 5 ॥
యిట్టీ తిప్పలకూనే నెట్లూ సహింతూనీ । పట్లా రక్షించూ మివట్టీ మాటలుగావు ॥ 6 ॥
పదిరెండు పదహారు కుదురూగ శృతపరచి । ముదమూన కరువాలి నొదలించు వేవేగ ॥ 7 ॥
బాసూరముగ భాగవత కృష్ణ దేశికులు । భూసూర లక్ష్మణదాసాని దరిజేర్చు ॥ 8 ॥



# సుబోధ రత్నమాల

శ్రీనిత్యానంద కొండోజు శీతయార్యుల వారిచే 1949 సం॥లో రచింప బడిన సుబోధ రత్నమాల అను గ్రంధము నుండి 1. గురుశిష్య సంవాదము 2. గురు నామంబనే రామ మిఠాయి అను కీర్తనను ఇక్కడ ప్రింటు చేయుచున్నాము.

## గురు శిష్య సంవాదము - తత్వము - ఆట

1. సూదిమోపను సందులేనిది । సూటియేమయ గురువరా ।
   యాదిమరుపులు లేనిది ఆది । యచలమందురు శిష్యుడా ॥
2. అచలమందున సచల భువనము । లెట్లుబుట్టెను గురువరా ।
   మచ్చికాతొ సర్వ జగములు । నిశ్చయించెను శిష్యుడా ॥
3. మచ్చికలు గలుగుటకు మూల । మర్మమేమయ గురువరా ।
   మూలమింతయు లేక వెలసెను । యేకమై తాశిష్యుడా ॥
4. యేకమనుటకు యెరుకయేదో । తేటపరచుము గురువరా ।
   కాకివలెను కేకలేయుచు । ప్రణవంబు బుట్టెర శిష్యుడా ॥
5. ప్రణవమూ బుట్టుటకు దాని । పద్దతేమయ గురువరా ।
   అనువుగా నీవు నేను నఖిల । జగములాయెర శిష్యుడా ॥
6. అకట నాదగు జన్మమెట్టుల । నాయదెల్పుము గురువరా ।
   ఒకటివే ఐదైదులచె । బ్రహ్మాండమాయెర శిష్యుడా ॥
7. త్వంపద తత్వంబనేటి । తానుయెవరయ గురువరా ।
   సత్యముగ నీవు సాంఖ్యతారక । సాధ నెరుగుము శిష్యుడా ॥
8. సత్తుచిత్తు లొకటి యనుటకు । సాధనేమయ గురువరా ।
   సత్యముగ నీవు సాంఖ్యతారక । సాధనెరుగుము శిష్యుడా ॥
9. సాధనలచే చావు పుట్టుకల । సంధి తొలగున గురువరా ।
   వేదములకు అతీతమైన । బోధ దెలియుము శిష్యుడా ॥
10. బోధ గురువులు నెటుల నుందురొ । తేటపరచుము గురువరా ।
    వాద భేదము లేక జన్మ । బాదమాన్పేరు శిష్యుడా ॥
11. జన్మలేదని జగతిలో దృష్టాంతమేమయ । గురువరా
    ఇమ్మహిలో కర్పూర దీపము । విధము దెలియర శిష్యుడా ॥
12. ధరణిలో ఫీల్ఖాన లక్ష్మణ గురుడు దెలిపిన దేమయా ।
    యెరుక లేదని శీత యాఖ్యుకు । పరము దెల్పెర శిష్యుడా ॥

## కీర్తన - యదకుల కాంభోజి - ఆది తాళము

1. గురునామంబనె రామమిఠాయి । కొనగల దొరలెవరండి దీని తినగల దొరలెవరండి ।
కొనగల దొరలు కోటికొక్కరే । తినగల దొరలు నూటికొక్కరే । హేమమునకు యిది జిక్కదు మిఠాయి ।
కామమునకు యిది గల్గదు మిఠాయి । రామజోగియై । లంగోటి బన్‌కర్ యమలం చోడ్కె ।
పంచ మహల్‌మే । పకాయె మిఠాయి । చక్కగ మీరు సేవించండీ ॥ గురు ॥

2. శ్రవణము మననము నిధి ధ్యాసయనె పొయ్యి బెట్టియు మూడు దేహములు కర్రలు జేసి ।
సుజ్ఞానంబనె నిప్పుబెట్టియు । భ్రమయను నదియే భాండము జేసి । విష్ణువనేటి పాలుబోసియు ।
రుద్రుడనేటి చక్కర జేర్చి । ద్వాదశి దినములు పాకము జేసి లడ్డు బనాయా రాజమిఠాయి ।
గురునాదముచే కీర్ బనాయా । భవబంధంబులు తెంపుకొని జేసుకొని ॥ కొనగ ॥ గురు॥

3. స్పష్టముగను భుజియించినవారికి । కష్టములన్నియు దొలగిపోవును ।
నిష్టతొ నుండిన నిజగురువులతొ । అష్టమదములచె । కెంకెం లడితే ।
దుష్ట సాంగత్యం దూర్‌కరోరే । నష్టములేక సద్ గురుమూర్తియు ।
నంతట నున్నడు । తెలిసినవారికి ॥ కొన ॥

4. పీలుఖాన యీ లక్ష్మణ గురుడు । శీతరాములకు సౌంజ్ఞదెలిపెను ।
ద్వాదశి షోడశి ద్వయమంత్రంబుల । జోలిచోడు దేరె ।
ద్వంద్వముక్యారే । ఏకం స్థిరమై వెల్గుచున్నది ॥ కొనగ ॥

---

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

మనసు నిల్పవలెరా । గురుపద । మనిశము గనవలెరా ॥ ప ॥
మనసు నిల్పవలె మర్మ మెరుగవలె । అనుదినమును గురు నాశ్రయించ్చినీ ॥ మన ॥ 1 ॥

అరి షడ్వర్గమురా । వారికి । అర్పించగ వలెరా । పరమ గురుని మది బాయక నిరతము।
గురినిల్పియు దుర్గుణముల ద్రుంచియు ॥ మన ॥ 2 ॥

పూజ సల్పవలెరా । పదముల । పాద తీర్థమునురా । యీ జన్మము దొలగుటకై గ్రోలియు ।
భూజనములు గని పొగడు చుండగను ॥ మన ॥ 3 ॥

ద్వాదశి షోడశిరా । నిజముగ బోధ గనుంగొనరా । మోదముతో నీపాదు దెలశితె ।
బాధల దునిమియు భ్రాంతుల జిమ్మును ॥ మన ॥ 4 ॥

కృష్ణ దేశికులురా । వేగమె తృష్ణ దీర్చె కనరా । విష్ణుమూర్తి యని వేడినందులకు ।
కష్టము దొలగెను స్పష్టము లక్ష్మణ ॥ మన ॥ 5 ॥

# నిశ్చల బ్రహ్మ

## శ్రీమద్భాగవత కృష్ణ దేశిక ప్రభువుల వారి వ్రాతప్రతి గ్రంథము నుండి సేకరణ

## శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణదేశికుల వారి ప్రియ శిష్యులు కుంకుమ మల్లయ్యచే సేకరింపబడినది

ఉపాధి విరహితాకాశ మేదిగలదో అదె బ్రహ్మ । అబ్రహ్మనిరాభాస బ్రంహ్మ ఇదినిఃశబ్దం । ఇదే ఉత్తబట్టబయలు । పిండమందువ్యాపించిన ఆకాశం పేరు జీవుడు । బ్రహ్మాండ మందు వ్యాపించిన ఆకాశం పేరు ఈశ్వరుడు । యీ జీవేశ్వరులనే సాభాసాభాసాకాశములనబడునూ । ఆనిరాభాసాకాశ బ్రహ్మమందు మూలమాయ జన్మించెను। ఆది వాయుస్వరూపమని తెల్యవలసినది । ఇది చంచలం । ఆవాయు స్వరూప మాయలోనె పంచభూతాలు త్రిగుణాలు పుట్టినవి । ఆకాశమందు పుట్టిన వాయువును వాయుదేవుడనిరి । ఆ వాయువందు అగ్ని పుట్టెను । దానిపేరు అగ్నిదేవుడు। ఆ అగ్నియందు వుదకం పుట్టెను । ఆ ఉదకమును నారాయణుడనిరి । ఆవుదకమందు భూమి పుట్టెను । అది బీజ స్వరూపమాయనూ । ఆ భూమి పొట్టలో అనేకమైన రాళ్ళు కలవు । అందు కొన్ని దేవతామూర్తి స్వరూపాలు గలవి కలవూ । అవ్వి అనేక మందికి కోరిన కోరికెలు యిచ్చి వారి చాత పూజలు గొంచూవున్నవి । యివిగాక । కట్టదేవుండ్లు। చెట్ల దెవుండ్లు । మంటి దెవుండ్లు । అనేకమంది ఇష్టదేవుండ్లె పూజ గొంచూవున్నవి । ఇన్ని దేవుండ్లకూ స్థానం వొక్క వాయుదేవుడని గురుతెరుగవలశినది । మొగదేవుండ్లు కొన్ని । ఆడిదేవుండ్లు కొన్ని । నపుంసక దేవుండ్లు కొన్ని । అన్ని వాయువు యందే వున్న చీమ మొదలు చేశి బ్రహ్మ పర్యంతం అందరు వాయువును దాటిన వారుకారు. అందరూ వాయువులో అంతఃపాతి అయినవారె అని తెలిశెది । త్రిగుణాలూ మధ్యన పుట్టినవి. ఆ గుణాల నుంచి త్రిమూర్తులు పుట్టినారు । వారు చెశె పనులు సృష్టి స్థితి ప్రళయాలు । యెరుక సత్వగుణం । మరుపు తమోగుణం । యెరుకా మరుపుల కలివిడి రజోగుణం । యెరుక నుంచి సమరక్షణ అవునూ మరుపు నుంచి మరణాంతమైన కష్టం సంభవించును। యెరిగీ యెరుగకుండుట చాత సృష్టి జరుగును.

ఆమూల మాయ అనే వాయువు రెండు తీర్లు । వొక్క వాయువు అన్నిటిని గుర్తెరుగు చుంది । వొక్కవాయువులో జగజ్యోతి।ఆ జగజ్యోతి అనంత్తమూర్తి స్వరూపం । దేవతలు దెవీలు । యీ వాయువులు అనేక వికారాలు గలవి అయినప్పటికీ రెండే భాగాలని తెలిసేది ।

శ్రీ ॥ సుఖ మహ మవాప్యమితి । గాఢాసుషుప్త్యప్పుడు । సుఖంగ్గా నిద్రబోచున్నానని । వెదనరహితెనవదతి । యెరుక లేదు గనుక మాట్లాడడు । తత్వమయె అహంవృత్తి శూన్యత్వాత్ । ఆ సమయ మంద్దు నేను అనె వృత్తి శూన్యమవుట వల్ల నుంచ్చి సుఖంకోవేద । సుఖమును యెవ్వడెరుగు । దుఃఖంకోవేద । దుఃఖమును యెవ్వడెరుగు । జ్ఞానస్యమూలం కిం । జ్ఞానానికి మూలం యెమి । అజ్ఞానస్యమూలంకిం । అజ్ఞాననానికి మూలం యెమి । కోవేద । యవ్వడుయరుగు। అహంవృత్యాఖ్య జీవోపాధి విలయె । ప్రతిజీవునికి ఉపాధియైన షువంట్టి । నేననే వృత్తి విలయ । మౌకొంచుచుండగాను। తస్మిన్ కాలె వెదనమస్తి వానవా । ఆ సమయమప్పుడు యరుగుటం వున్నదా లేదా । యదా అహంజాయతె । తదావదతి యెప్పుడు నేననె వృత్తి పుట్టునో । అప్పుడు మాట్లాడుఛాడు । అహమితి । నెనసీంన్ని । త్వంమితి । నీవనీంన్ని । జ్ఞానమితి। జ్ఞానమనీంన్ని । అజ్ఞానమితి । అజ్ఞానమన్నీంన్ని । భేదమితి । భేదమనీంన్ని । అభేదమితి । అభేదమనీంన్ని । బ్రాహ్మణోహం। నేను బ్రాహ్మణ్ణి అనీంన్ని । చండ్దాలోహం । నేను చండ్దాలుణ్ని అనీంన్ని । నిర్గుణః । నిర్గుణుడనీంన్ని । సగుణః।

సగుణుడనీంన్ని। వ్యవహారో వినివృత్తేః। స్వభావః। యీరీతిగా వ్యవహారం జరిగేది స్వభావం। వర్షసమయె గర్జితాది పటాటోపవత్। వర్ష సమయమప్పుడు పురుములు మొదలైన పటాటోపంవలెనె। సకాలెసత్యవద్భాతి। దేనికాలమప్పుడు అదిసత్యం వలెనె ప్రకాశిస్తుంది। అగ్నివత్। అగ్ని హోత్రం వలెనె। సూర్యవత్। సూర్యుని వలెనె। చంద్రవత్। చంద్రునివలెనె। కదాచిత్కమేవ జ్ఞాపకః। వొకానొకప్పుడు। జ్ఞాపకము వచ్చును। అంధ్ధకారవత్। జ్ఞాపకరహితః। అంధ్ధకారంవలెనె। జ్ఞాపక రహితం అవును। విచారవతాం ఉభయరహితః। విచారవంతులకు జ్ఞాపకమూన్నూ। జ్ఞాపక రహితమూంన్నూ। రెండ్డూ లేవు। అహంవృత్యాఖ్య జ్ఞాపక రహిత త్వాత్। నేననెవృత్తి రూపమైన జ్ఞాపకరహితమవుట వల్ల నుంచ్చి। కదా చిదస్యపి సర్వశూన్యనిశ్చయః। వొకానొకప్పుడు జ్ఞాపకం వచ్చినా సర్వశూన్యమని నిశ్చయం। వుండెనా। అయమేవ జీవాఖ్యోపాధిరహితః। యిదే జీవాఖ్యోపాధిరహితము। ఇదమేవ నిజగురూపదేశః। ఇదయ్యెవె నిజగురూప దేశము। వ్యవహారకాలెభోజనకాలె। చదృఢాభ్యాసః। యిది వ్యవహారకాల మంద్దు గాని। భోజన కాలమంద్దు గానీ। యప్పుడూ మరువకుండ్డా। దృఢాభ్యాసం ఆయనా। అయమేవ చిజ్జడరహితః। యీచిజ్జడరహితము। క్షేత్ర క్షేత్రజ్ఞ రహితః। క్షేత్ర క్షేత్రజ్ఞరహితము। సగుణ నిర్గుణరహితః। సగుణ నిర్గుణరహితము। ప్రకృతి పురుషరహితః। ప్రకృతి పురుష రహితము। జగజ్జీవరహితః। జగజ్జీవరహితము। సదసద్రహితః। సదసద్రహితము। జ్ఞానాజ్ఞానరహితః। జ్ఞాన జ్ఞాన రహితము।

# గురుని ఋణము

గురుని ఋణము తీర్చతరమా। బ్రహ్మాదులకైన। గురుని ఋణము తీర్చ తరమా॥

1. గురుని ఋణము తీర్చుటాకు। నరునివశము కాదు వినుమా।
   శరణుజేసి మ్రొక్కి తేనూ కరుణతోడ బ్రోచునుగాని॥ గురుని॥
2. గురుడు నరుడు అనగా రాదు। గురుడు హరుడు గాడ వినుమా।
   పరగనీ మనస్సేంద్రియము। దురితములను తొలగ చేసే॥ గురుని॥
3. యేమిఇత్త మన్నా గాని ఏమి సరి బోలనాయ।
   లెక్క పెట్టగ రానిపరమూ। మక్కువతో ఇచ్చినారు॥ గురుని॥
4. భువనములు ఇత్తమన్నా। బుద్ధికి సరిబోలనాయే।
   భవనములు ఇత్తమన్నా బాగుగా సరిపడక పాయే॥గురుని॥
5. అన్నిటికి అన్ని బాయే। ఉన్న దాన్ని సరిగాకపాయే।
   అన్నిజూడ ఎరుక మరుపు। ఏమో ఏమో మాయమాయే॥ గురుని॥
6. మూడు। ఆరు మునిగిపాయే। ఏడు ఎనిమిది కాని వాయే।
   తొమ్మిది పది తోడనె పాయే। ఏకాదశి ఉపవాసమాయే॥ గురుని॥
7. ఐదు। మూడు। అంతమాయే। ఇరువదిఐదు, ఇమిడి పాయే।
   శుద్ధజ్ఞానము, శూన్యమాయె। కేవలం పరిపూర్ణమాయే॥ గురుని॥
8. బట్టబయలె బ్రహ్మమాయే। వట్టి యెరుక కానిదాయే।
   గుట్టువరుసచేత దెలియ। పట్టు విడుపులు లేకపాయే॥ గురుని॥
9. గురుడు లక్ష్మణార్యుడాయే। గురుడు లేని దంతామాయే।
   మళ్లయూని మదిలో ద్వాదశి। మరువకుండా నిలిచి పాయే॥ గురుని॥



## INTRODUCTION ON

# BRUHADWASISTHA SIDHANTHA

**BY SAMISTI BODHANANDA UPPALANCHI KRISHNA MURTHY PRESIDENT OF PHEELKANA LAKSHMANA PRABHU ACHALA GURU MANDIR, SEETHAPALMANDI, SECUNDERABAD.**

The Indian philosophy is very ancient in the World and its culture is brought through 'Vedas'. The philosophy of Vedas and Vedanta is created to propagate all types of Adytmika Bhakthi and it leads to reach the goal of "Mukthi Marg for the human race.

The main aim and meaning of Vedanta is "Enlightment of Vison of knowledge and its power". The Vedas were written by Sri Vysa Mahamuni. He has made the Vedas into four main parts ie., 1. Ruk Veda 2. Yajur Veda 3. Adarvana Veda and 4. Sama Veda. He further made easy to understand the knowledge of the Vedas to the world for which he was called as Veda Vyasa Maha Muni. The Vedas vary from begining to the end and the last part of the Vedas is called as "Vedanta" which has manifested to enlighten the philosophical knowledge of eternal secret of Parabhramha Gyana.

The Vedas are further divided by other Muni's and they are called Upanishads. These Upanishads deeply explain and are to understand the inner meaning of Vison knowledge of Power of Parabhramha of eternal knowledge Paramatma easily. The Vedas and Upanishads have became famous in Indian Philosophy. The Upanishads are divided into 1180 parts. The Rukveda has 21 parts, the Yajurveda has 109 parts, the Adharvana Veda has 51 parts and last by Samaveda has 1000 parts. Later on many eminent and ancient persons studied thoroughly the vedas and Upanishads to make further easy to understand the secret of Parabhrama. Sri Shankaracharya made close study of all these Upanishads and picked 108 upanishads for easy study and understanding to gain the knowledge of Supreme Bramham.

Sri Shankaracharya has studied the Vedas and all Upanishads and select 10 upanishads for the sake of common people. They are 1. Kena 2. Eshavasa 3. Mandukya 4. Kata 5. Prasnow 6. Mundako 7. Thatithianyo 8. Ithareyo 9. Chandogyo 10. Brudadaranyka. The Upanishads are to gain the spiritual aspiration of Divine Bakti. Divine Meditation and Divine Supreme Parabraham. The actual and absolute process of Vedas and Upanishads are to attain the absolute vision of Brahmam. Theses are simplified to understand and manifested in Four Maha Vakyas (1) Pragnanam Bramham (2) Aham Bramhasmi (3) Thatwamasi Bramham and (4) Ayamtma Bramham.

Ultimately the Vedas and Upanishads will lead to establish the spiritual communion of spiritual manifestation to transmigrate the absolute Supreme Divine Power of Bramham to the human race.

Coming to the real consciouness of awake of the awareness of Supreme Power of Bramham is inspired clearly to make understanding Vedas and Upnishads as Veda Yagamaya of Adyamika

Bavana to get clear concept of Supreme Gyana Karma marga. Bruhadwashista Sanatanachala Paripoorna Bramham denotes about the Gynana Karma Rahita marga and hence it is called Bruhadwashista.

Coming to the real consciouness of awake of the awareness of Supreme brahmam is inspired clearly to make understand the Sanatanachala Paripoorna Bramham of Bruhadwashista Sidhanta by the sailent feature of vision of omnipresent Adiguru Dhakshanamurthy. This every existing absolute state ommipresent is know to traditionally Achala Guru Vishnu, Surya, Janaka, Sukha, Yajnavlkya Sandeepa, Sri Krishna, Yuddava Achala Gurus and so on. Our Sanathana Sampradayaka ancient gurus gained the experience of the above Sidhanta knowledge. The Achala guru Sri Sridhara Swamy gained the knowledge of Brihadwashista Sidhanta through his Guru.

On one fine day in his visits Sri Siva Rama Dikshitulu happened to meet Sri Sridhara Swamy. Sri Sridhara Swamy was awaiting for a learned scholar who could spread the Achala Sidhanta to the down trodden people who are really required to gain the knowledge of Janmarahitya of Branti Rahita marg.

Sri Siva Rama Dikshitulu was wellknown Sanskrit Pandit and celebrity thoroughly studied the Vedas, Upanishads, Ithihas, Purnas and became a scholar these fields. He has moved all over the country and to acquire the knowledge of the spiritual aspiration of awareness of the vision of Bramham and consciousness of absolute supreme power. Sri Siva Rama Dikshita became disciple of Sri Sridhara Swamy and wrote the book "Bruhadwasista Sidhantam" with the knowledge gained from his Guru and his personal experience. Only this book preaches elaborately on Achala Sidhanta. Later on Sri Parasurama Narasimha Dasu wrote "Churnika" which is a method of Upadesa Kramamu for the disciples for teaching.

Sri Siva Rama Dikshithulu had many eminent disciples. Among all of them prominent were Srimath Kambaluri Appayyamanthri, Rayochuru Rama Ligaiacharyulu. Amalavathiswarulu, Vallurie Ramkrishnayya and Swapraksha Bhaskara Yogeshwarulu. These eminent Achala Gurus have spread this Achala Sidhanta in the entire country. Sri Siva Rama Dikshitulu disciples formulated the Siddanta into four ways. 1. Sankya 2. Taraka 3. Amanaska and 4. Maha Vakyas then Paripurna Bhava.

Taraka, Amanaska to manifest the "will power" of Guru Swaroopa in mind and finally to acquire sufficient knowledge by practice in Sadana Sampathi with perfect stability in mind. Then the Achala Gurus Teaches different ways and means of Prabodhas on Sidhanta and then finally explain the real Branti Rahita marg of Achala Sidhanta by Dwadasi, Shodasi, the two main mantras and in practical confirmation by Panchadasi with Drusta-drashtantha. These are explained by simple ways to understand.

Among his disciples the eminent Scholar in Achala Sidhanta was Sri Appayya Mantri. Among Sri Appaya Mantri disciples eminent were Sri Parasurama Sitha Rama Swamy and Parasurama Narasimha Dasu.

The famous and well studies scholar Sri Parasurama narasimha Dasu wrote Badradi Rama Shtakam, Parasurama Srita Rama Shatakam, Vaidya Sastram, Parama Thathva and Siva Rama Diskhsitha Churnika. Both the brothers Parasuram Seetha Rama Swamy and Parasuram Narasimha Dasu lived together.

Sri Bhagavatha Krishna Prabhu lived in 18th Century at Kolanupaka Village of Nallagonda District. He was beloved son of divine spiritual parents Janakamma and Narayana Yogi. When Krishna Prabhu was young he lost his parents, brothers and sisters even his beloved wife Ananta Laxmi and Children.

Ultimately became alone and lost all hopes to lead life. He was fed up with the life. At that moment he got the divine blessings from his guru Sri Parasurama Seetharama.

Actually Sri Krishna Prabhu was Sanskrit Pandit, eminent scholar, philosopher and astrologer and used to celebrate Archana as Pujari and Archaka in Rama Temples and he used to deliver Harikatha Gana in surrounding villages. He was a great Badradri Rama Bhakta in those days. He was well stuided all Sanskrit books as well as in Marati and got sufficient knowledge in philosophy and was genious enough to easily catch hold of the secret knowledge of the Achala Sidhantha from his guru. He shifted from his village Kolanupaka to Hyderabad and being a Bhramin started living by preaching Bhakthi, Gyana Viragya and Ateeta Bhavas. Many people came to him and attracted by his Teaching Prabhodas and became his disciples. Among them were Smt. Jalamamba, Sri Fheelkana Laxmana Prabhu, Sri Fheelkana Shankara Prabhu, Sri Adi Raju Thirumala Raya Sharma, Sri Andhra Peddy Venkata Reddy, Sri Sadhu Ram Bahudur, Sri Mangolu Venkata Narasayyachari and many others.

Coming to the point his disciple Jalamamba took care of her Guru Krishna Prabhu and encouraged to spread the Achala Sidhanta. Sri Krishna Prabhu wrote many famous books about Achala Sidhanta like **"Shakti Dwaya Nirasakambaina Suddha Nirguna Thathva Kandartha, Kanda Padyam", Shakthi, Dvaya Neerasakambina Suddha Nirguna Thatwa Kandharta Aneeka Sadrustanta Prakashika Poorna Grandham".** He has also written a book in poetry named Dwadasha Bhodalu preaching to Smt. T. Jalamamba. Then wrote Saramshagyanambanu, Jeevan Mukta Prakashika, Vedanta Varthikyam, by collecting information from Ancient books which are simplified and required for future generation.

With broad view, the aspiration of spirtual Divine consciousness of the Achala Sidhanta, Sri Bhagavath Krishna Prabhu elaborately preached the Paripoorna Bodha of Branthi Rahitha Bava, with deep Meditation in mind and keeping Guru Swarupa in mind to gain the Janma Rahithya, Sri Fheelkana Laxmana Desika Prabhu and Sri Fheelkana Shankar Prabhu dedicated disciples of Bhagavtha Krishna Prabhu have given divine service to Achala Sampradayaka Sidhanta.

Sri Fheelkana Laxmana Prabhu has sacrifised his own House at Begumpet Village as Guru Mandir for Guru Pooja and preachings. With the strongest devotion of divine Bhakti towards his guru in mind, he wrote **"Subodha Ratanakara Astothara Thatva Mala, Achala Thatva Shiromani and Sugynana Teethartha Tatva Ackandamala".**

To day Srimath Fheelkana Laxmana Prabhu Achala Guru Mandiram stands as decent Golden Achala Guru Mandiram at Seethaphalmandi, Secunderabad.

Srimath Fheelkana Lakshmana Prabhu's centenary Guru Pooja Aradhana is beeing celebrated on grand scale on 7th and 8th February 2013. We pray that Srimath Fheelkana Lakshmana Prabhu's Divine Blessings always showers on us.

**SARVAM SADGURU CHARANARAVINDRPANA MASTHU**

**Samisti Bodhananda Uppalanchi Krishna Murthy**

President of Mandhir



**Sri Dayananda Savanth Seetharam Rao**
**Boudha Nagar, Secunderabad.**

# OM
# SRI SATGURUVENAMAHA
# SRI BHRAMHANANDAYANAMAHA

Srimad Veda Vendanta Scholar, Atmaikya Shareera Rahitulu (Body less state) Sri Shivarama Deekshitulu desired that all persons should be enlightened particularly the down trodden / illiterates. The Achala Guru has written down the entire Sri Sreedhara Swamy Akhand Gynan Paripurna Bhavam and Sri Sandeepa Maharishi Teaching in simple Telugu Language and named "Srimadbhruhadvashista Achala Siddantam Sree Shiva Rama Deekshitiyamu"

Sri Shivarama Deekshitulu found that it is very difficult to follow for ordinary persons Vedanta Yoga Path and hence without explaining the Yoga Path and also since as per the Guru's experience Yoga Path is not easily can be followed because of strict procedures/practices, needing secluded neat place, restricted food, silence, pease of mind and few among thousands of procedures to be followed to attain yoga path.

Considering the difficulties connected with Vedanta Yoga Path Sri Shivarama Deekshitulu has made a path for normal family persons who were kept away from knowing the ultimate Achala Guru knowledge for ages.

The main purpose was that ordinary person should understand the far reaching meanings of the ultimate Achala Guru teachings which he obtained in Sanskrit through his Guru.

The Achala Guru has devised a simple method i.e., Karma Marg - Bhakthi Marg and Gyana Marg.

In this world all religious heads / personalities tried to find the presence of God in their individual way and established their own Religions from time to time. But no religion has firmly established the presence of God and proved it. It is because they could go upto their individual imaginations and the experience they got and in this way one religion will not accept the establishment of other religions.

Achala Guru Sri Srimad Bhagvatha Krishna Prabhu have written a Kandartham in Telugu as follows. "Matamula varalu tama Sammathamynatuvanti sastra maryadalache Mithameru Parachukoni Bhahu gatulanu kalahinturathi gathi neekemitikee chepalatha jende sthithy neekemitikee pratileni Eee Bhattabayalunda Juchee Santhathamu LeNeruka leedani nammu mika varri gathi neekemitiki chapalatha jendesthithy neekemitikee."

Which means that Religious Persons have established their own religions and made their boundaries, Rules - Regulations. Sastras etc. and argue and disagree with others. The Guru says why do you go into that unending disputes - arguments-disagreements and get disturbed. The Achala Guru says to know ever existing state and to know non originated existence of I (Aham) by surrendering self to the Guru.

Due to ignorance of real self and not allowed to know by selfish persons those who ruled and ruling kept the other down trodden class of people in bondage socially & economically through ages and consequently the country could not progress in all fields. The majority of the people were kept in bondage in many fields in the name of Gods, Sastras etc. and they used for their selfish benefits and still using them because of ignorance of self.

Here one should understand that if you go back say 15 to 20 thousand years the whole human race was in jungles. At that time there was no religion, casts, cread all were same. As the time passed and as intelligence was increasing in human beings selfishness started growing and ultimately those who were strong started establishing their kingdowns and started using persons who were weak as their servants. In the course of time particularly in india persons at the helm, (powerfull) made castes, creads etc and divideded the whole human society due to which the country could not progress in all fields.

The ignorance of the people is being used by the selfish powerful persons for their benefits and domination in the society.

Cutting across all such social, religious draw backs Sri Shivarama Deekshitulu tried to enlighten all persons without any discrimination to realize self through Guru - Shishya Parampara.

With the teachings of Sri Shivarama Deekshitulu people will be liberated from slavery of all kinds. Life on earth is with Panchabhoota Samudayamu (Sky-Air-Heat-Water-Earth- Aakashmu-Vayuvu-Agni-Neeru-Bhoomi). We find all these five elements on earth only and hence life is being formed.

When you consider human beings, what they eat the food is converted into blood - then Sukla-Sonithamulu and human bodies are formed. If the same food is eaten by Dogs then also the food is converted in to blood and Sukla Sonithamulu and Dogs bodies are formed. This shows that life (Jeevapadarthem) is same and it will take the shape of the body in which it is entering. In this way the whole globe is having life (jeevapadartham) matter. So in reality there is no beginning i.e., origirator of the life. In short the I (Aham) has no originator and forming by itself with Body (Shareeramu) and both are inseparable. One cannot exist without the other and vice-veera.

For example take the seed of Banyan Tree unless that particular characterized atoms are formed in the seed the Banyan Tree is not seen. Hence without characterized atoms (matter) Gunamulu Koodina Vyakthamugaani Anuvula Padartham Leekanu Anukonu roopamu Leerpada Jaalavu) desired forms cannot form.

Hence Sri Shivarama Deekshitulu said **"Mulamuleni Eee Gurthuregeshariramu eemiyu Ledu".** If one wants to know in detail and the inner meaning one should put efforts to learn Sri Shivarama Deekshiteeyam by surrendering self to True Achala Guru. Here Achala paripurna Bhoda is required.

**Sarvam Sri Satguru Charanara Vindarpanamastu.**

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః

# అచల గురువు - పరిపూర్ణ భావ సిద్ధాంతము

## శ్రీశివరామదీక్షితీయము నుండి

గురువులేని యెడల గురి తెలియదు. మేము అనుభవము వల్లనే తెలుసుకొన్నాము అనుట కాదు. అనుభవమనగా తిండి గాదు, ఆలోచన చక్కగా చేయవలెను. వంకర ఆలోచనగారాదు. మొదలు వంకర అయితే తుద వెళ్ళా వంకరే అగును. గనుక వంకర లేని మార్గము తెలియవలెను.

గురువునకు పదిరెండు సంవత్సరములు సేవ చేయవలెను. దీర్ఘకాలము గురువు సేవచేతగాని భ్రాంతి రహితులు కారు. శిష్యుడు యేమైన తొందర పడనీ గాక గురువునకు సహనము గలుగవలెను. మాటల వల్లనే బోధ చేయుచుండవలెను. తొందర పడుటకు అహమును నమ్మిన మార్గమా లేకపోతే కండ్లు, ముక్కు, చెవులు మూసుకొని చూడమని యనడమా, నాదము వినుమని అనడమా నడినెత్తిన చెయ్యి పెట్టి నీవే నేను, నేనే నీవు అని పలకడమా, తన నీడ చూచుకొని మీద ఆకాశ మందు చూడమని అనడమా, యిది ఆ మార్గము కాదు. ఈ మార్గము తెలియడము దుస్తరము, తెలిసిన తరువాత సులభము. తెలిసిన తరువాత తాను నిత్యమనే ఆశ వుండదు. అప్పుదు నరకము లేదు, స్వర్గము లేదు, అనుభవము లేదు, యేది లేదు, ఏలాగున తెలియగలరు.

ఈ ఉపదేశమునకు మంత్రము లేదు, తంత్రము లేదు, యోగములు గావు, ధారణములు గావు, క్షేత్రములుగావు, మహా సూక్ష్మ సులభము. ఈ సులభము పదిరెండు సంవత్సరములు శోధించవలెను. ఆ వాక్యము మరువక యుండవలెను. ఆవరణాంతము యుండవలెను.

ఒకటి యెప్పుడు గలదో రెండోది అప్పుడే గలదు. ఒకటి రెండవుచున్నది. రెండే మూడవుచున్నది. ఈలాగున అంతటా నిండుదురు. ఈ భ్రమలన్నియు అహంకార ధర్మములు, శరీర ధర్మములు. ఈ అహంకారము నరకము. ఈ అహంకారమును, యెవరు వదలజాలరు. అహంకారము దేనివలన గలిగెనో దానిని విడువవలెను. అహంకారమునకు మూలము యేమైనది గురువు వలన తెలియును. అహంకారము గల గురువును వదలవలెను. తిరిగి చూడరాదు. అహంకారము వలననే అందరు నరకమును పొందుచున్నారు. అహంకారము వలననే గదా శత్రు-మిత్రులలు గలుగుచున్నారు. అహంకారము లేనివారికి జనన మరణములు లేవనే సిద్ధాంతము. అహంకారమును గురూపదేశము వలన గాని తెలియజాలరు. అహంకారమును వదిలిన వాడు త్రిమూర్తుల కన్ననూ అతిశయుడు.

కులములను యెవ్వరు చూచినారు. గోత్రములను యెవ్వరు చూచినారు? కులగోత్రములను అహంకారమే (నేననునది) యేర్పరచినది. అహంకారము ఒకటే గాని అహంకారమునకు యేమి కులములు గలవు? అహంకారము ఏ కులము కాదు గదా? కులములు అనగా గుణములు గాని రూపమునకు యేమి గుణములు.

జీవునికి అహంకారము ఆధారము అహమునకు జీవుడు ఆధారము. అహమే దేహము, దేహమే అహము, ఒకరు చెప్పితే తెలిసేది కష్టము. తానే ఆలోచించవలెను. తనకు తోచకుంటే యితరుల నడుగవలెను. అది యోగ్యులనడుగవలెను. లేకుంటే అది చెడిపోవును.

గురువును విచారించవలెను. గురువు అహంకార రహితుడు కావలెను. అహంకారములేని గురువు అందరి వలెనే యుండును. ఆయన సన్యాసిగా యుండదు గృహము గలిగే యుండును. ధారాపుత్రాదులున్నాగలరు. ఆయనకు అహంకారము లేదు.

తన బుద్ధి తనకు స్వాధీనము కావలెను. బుద్ధి స్వాధీనము కాకపోతే పాము నివాసముగా నున్న యింట్లో కాపురము చేసినట్టుగా యుండును. ఆ కాపురము అతి భయంకరముగా నుండును. కనుక స్థిరబుద్ధి గలిగితే వానిదే సుఖము.

# పరిపూర్ణ భావ సిద్ధాంతము
# శ్రీ శివరామ దీక్షితీయము

1. ఈ జగత్తుకు నొకరైన కారణుడు లేదు.
2. అధిష్ఠానము లేనిది యిదే । శరీర జన్యం గుర్తెరిగే జ్ఞానం ।
3. యెక్కడ సర్వం తోచిందో అక్కడనే సర్వం లేకపోవలెను.
4. యీ శరీర మందు లేక వున్నది గనుక బ్రహ్మము అన్న, మాయ అన్న, ప్రకృతి అన్న, అవిద్య అన్న, అజ్ఞానమన్న ఒక్కటే.
5. పరిపూర్ణం దేనికి మూలము కాదు । తనకు మూలం లేదు ।
6. దేహం నేను అనే భావన లేకుండా యెవ్వరు చేస్తారో వారే గురువులు ।
7. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం తోటి । యేమివున్నాదని ఆశపడ్డా ।<br>భ్రాంతి రహితం కాదు । వెనుకటి పుస్తకాలలో ముచ్చటతేకండీ । అది నేనే చేసినా ।
8. యీ శరీరం యెటువంటి దంటే । సర్వశూన్యం యెటువంటిదో అటువంటిది ।<br>శరీరం లేకుంటే యేలాగు వున్నదో । ఆలాగే పరిపూర్ణం వున్నది ।
9. పుట్టక మునుపు శరీరం యేమీలేదు । చచ్చిన తరువాత శరీరం యేమీ లేదు ।<br>కలతోచిన శరీరాలు యెరుక వుండంగానే । యేమీ లేదు ।<br>అలాగే యీ మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । యప్పటి అచలమే వున్నది.
10. గు॥ గురుస్వరూపం యెటువంటిది ॥ శి ॥ శరీరం లేనిది । పుట్టని చావనిది ।<br>మొదలు కొనలేనిది । రాకడాపోకడా లేనిది । సకల దేశాల యందూ ।<br>సార్వకాలాల యందూ । చలించక వున్నది । జ్ఞానఖర్మాలు లేక<br>తనకు తానే స్వతసిద్ధమై చలించక వున్నది । గురుస్వరూపం ।
11. సార్వకాలం·మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అనుట<br>అభిప్రాయం పుట్టని చావనిది । మరిఒకటి వున్నదని<br>యెన్నటికీ సంశయము వద్దు ।
12. యేమీ లేని బట్టబయలులో యేమీ లేక వున్న వారు పరిపూర్ణులు.

**సర్వం శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు**

**శ్రీ దయానంద సావంత్ సీతారామారావు**
**మందిర కార్యదర్శి**



**శ్రీ సద్గురవేనమః**

**శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగీశ్వరుల వారి ప్రియశిష్యులు శ్రీ పూర్ణానంద అరిగె రామస్వాములవారిచే రచియింపబడిన కొన్ని కందార్థాలు, కందపద్యములు.**

1. కవిని గాను విద్య గలవాడగానోయీ । జనుల మెప్పు
   కొరకు చెప్పలేదు । నాభావమిమిడిస్తి । నచ్చేనా
   చదువుడీ । అనుమనుమో భూమ అరిగె రామా ॥

2. అరిగే వారే కదా । అవనిలో జనులెల్ల । అరిగేవే
   కదా దృక్కు కందుటెల్ల । అరుగకుండ దున్నదది
   యేమో అనరాదు । అనుమనుమోభూమ అరిగెరామా ॥

3. పాపాత్ములకునే పాపియైతోచితి । పుణ్యాత్ములకునే
   పూజ్యునైతి । పాప పుణ్యములనే పరికింపలేనైతి ।
   అనుమనుమోభూమ అరిగెరామా ॥

4. నాకు నేను గాను । నేనన్యులకుగాను । నాకితరులౌదు ।
   రన నవ్వుగాదే । నేను నీవనెడు భ్రాంతి
   నరక కూపము గాదె ।అనుమనుమో భూమ అరిగె రామా ॥

5. గుణశ్రేష్ఠుడను నేను । గుణహీనుడను నేను । పరమ
   పాపిని నేను । పరమహంస । నేనేమి లేకనునే
   సర్వమనుటాయె । అనుమనుమో భూమ అరిగె రామా ॥

6. నీదె సర్వంబనును । నీతి పరుండెప్పుడూ ।
   నాది నాది యనుచుండు । నల్పబుద్ధి । నీదినాది
   యనకుండు । అచలుండెప్పుడూ । అనుమనుమో భూమ అరిగెరామా ॥

7. పలుకనెంచని వార్ని । పలుకరించుటరోత । ప్రాయంబు
   చెడి చేయు పెండ్లి రోత । ప్రియములేనిచోట
   పెనుగులాడుట రోత । అనుమనుమో భూమ అరిగెరామా ॥

8. జనులు నాకు పిచ్చి । జనులకునే పిచ్చి । జనులు
   నాపిచ్చెరుగ జాలరోయీ । జనులు నాపిచ్చెరుగ
   జగదీశులౌదురూ । అనుమనుమో భూమ అరిగెరామా ॥

9. మదిలో సాధకుడెప్పుడు । కుదురుగ సంసార బంధముల్ । గూల్చుట కొరకై
   వదలక కృషిచే జ్ఞానము । చెదరక సత్క్రియల్ । తాజేయూచు నుండున్ ।
   స్వార్థబుద్ధి ఛేదించు చుండున్ । సదస్యుడై యిహపరముల్ । గూల్చుట కొరకై సాధూ
   సజ్జనుల పొందూ । సలుపూచూనే । ప్రొద్దూ చేయూచు నుండున్ । స్వార్థబుద్ధి ఛేదించుచుండున్ ॥

10. మనసే జీవన మూలము । మనసే సుఖదుఃఖసర్వ మమలకెల్లన్ ।
మనసే మనసుకు ప్రభూవా మనసే । మలినంబైన । క్రియామాటా ।
మలినంబౌ । నద్దాన జీవన మంధకారంబౌ । వినుమీ పాపఫలంబు ।
వెనువెంటా ఇక్కట్లూ । తనఛాయ తన వెంటా తరలీవొచ్చిన యట్లూ ॥ క్రియామాటామలినంబౌ ॥

11. భుక్తి శరీరంబున కని । ముక్తి జీవునకటంచు । ముందు
గురునిచే । యుక్తిని సాధించి విడు । భుక్తీ ముక్తుల భ్రాంతి ।
మురయూచు ఈ కీలూ । గురుముఖమూన । ఎరిగీతె చాలూ ।
యుక్తామౌ ఈ బోధా సక్తులకే గాని । అనాసక్తుల కెట్లౌను ॥ మురయూచు ఈ కీలూ ॥

12. భుక్తిచె ముక్తి సాధనెట్టిదో । యుక్తిని దెలిపెదను నీవు ।
యూహను గనుమా । భుక్తినార్జించితత్ । భ్రమరక్తిని
నిరసిస్తివేని । రాజమార్గమదేరా । సుజన ఘనమూల సూచ
నట్లే గనరా । ముక్తీయే భుక్తౌను । భుక్తీముక్తూలవీడ
నిజముత్తంబెరుగూమూ ॥ రాజ మార్గమదేరా ॥

శ్రీ నిర్మలానంద దొంతి కామేశ్వరరావు
మందిర ఉపాధ్యక్షులు

---

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

హరిహారూల కందారాని అచలభావము దెలిశీతి ।
పరిపూర్ణా బోధాను దెలశీ పరమా పదమూ గాంచితీ ॥ ప ॥

సారాము లేనట్టి యీ సంసార సాగరమీదీతి ।
ఘోరా పాతాకములా బట్టిగోటా నెగరాజిమ్మితీ ॥ హరి ॥ 1 ॥

చూపు రూపూ లేని దానీ సూచాన వినినమ్మితీ ।
అపో జ్యోతీ యానె యరుకను చూపులో నాజూచీతి ॥ హరి ॥ 2 ॥

చిన్మాయ బ్రహ్మం బానేటి చిత్కళలా దర్శించీతీ ।
తన్మయ రహితామై నపుడూ జన్మాలంటా కుండితీ ॥ హరి ॥ 3 ॥

మంత్రా యుగ్మములా రెండిటి నీమరువాక జపియించితీ ।
యంత్రా తంత్రములా శోధించీ యేమీలేదని యరిగీతీ ॥ హరి ॥ 4 ॥

ధరలోశ్రీభాగవత కృష్ణుని నిరతాము శేవించితీ ।
కరుణాతో లక్ష్మాణా దాసును కడతేర్చీ రనిపల్కితీ ॥ హరి ॥ 5 ॥



# శ్రీ గురుభ్యోనమః

శ్రీపూర్ణబోధాచార్య భక్తసమాజం, శ్రీపూర్ణగురు భక్త సమాజం భక్తులకు క్షరాక్షర విలక్షణ చక్రపాణి నాయన సద్గురు సంస్మరణతో సమర్పించు "మంత్రధ్యాన వివరణ పత్రము"

**భక్త సోదరులారా !**

**శ్లో॥ సప్తకోటి మహామంత్రా చిత్త విభ్రమ కారకః ।**
**ఏక ఏవ పరోమంత్రో గురురిత్యక్షణ ద్వయం ॥**

అనగా ఏడుకోట్ల దేవతలను పూజించడానికి ఏడుకోట్ల మంత్రాలు వున్నాయట. ఇన్ని మంత్రాలతో ఇంతమంది దేవతలను పూజిస్తే- మనస్సు చలించిపోయి, భ్రమలో పడిపోతామే కాని, ఫలితము వుండదు. గురురీతి=అనగా గురువు అనెడి రెండక్షరములు గల మంత్రమే పరమార్ధమునకు దారి చూపగలదు. ఆ ఒక్క మంత్రమే సకల మంత్రములను హరిస్తుంది అని దీని భావము – (గురుగీత నుండి)

కాబట్టి 'గురు' అను రెండక్షరములే నిత్యము స్మరణ చేయ్యాలి. ఆపైన గురుదేవులు ఉపదేశించిన మంత్రములు కూడా పఠించాలి! మంత్రాలకు మహిమలున్నాయి. సృష్టి క్రమమునకు మూలమైన పంచభూతాలలో ఆకాశ తత్వమే మొదటిది. అందునుంచి ఉధ్భవించిన మొట్టమొదట ప్రకృతియే శబ్దము. ఆ శబ్దమే మాటలయ్యాయి. మాటలకు ఒక రూపము యిచ్చినదే అక్షరము. కాబట్టి అక్షరాలకు అనంతమైన శక్తి వున్నదని అర్ధమౌతుంది. అయితే అన్ని అక్షరాలకు అంతటి శక్తి లేదని, అందునుండి "బీజాక్షరాలు" తీసి, వాటితో మంత్రాలు తయారు చేశారు వేదఋషులు ! అందువలన, వారు నిర్ణయించిన ఏడుకోట్ల మంత్రాలు వల్లించడం కంటే "గురు" అనే స్ఫురణతో గురుదేవులిచ్చిన మంత్రాలు వల్లించడం మంచిది.

మన గురు సాంప్రదాయకములో మంత్రాలను మూడు రకాలుగా విభజించవచ్చును! 1. జీవమంత్రాలు 2. సాధన మంత్రాలు, 3. శోధన మంత్రాలు ఉన్నాయి.

**1. జీవ మంత్రాలు**

రా–మ (తారక మంత్రం)
సో–హం (సోహం మంత్రం)
హం – క్షం (హంస మంత్రం)

ఈ మూడు జీవుని పవిత్రముగా ఉంచడానికి, జీవచైతన్యం పెంచుకొనడానికి, ఆరోగ్యంగా ఉండడానికి, గురువులు ఉపదేశించినట్లు ఇడా- పింగళముల ద్వారా సాధన చేస్తే చాలును.

**2. సాధన మంత్రాలు**

పంచాక్షరీ – పంచీకరణ
అష్టాక్షరీ – జప విధానము

**3. గురుమాలా మంత్రం**

కరన్యాస – హృదయన్యాస.

ఈ మంత్రాల వలన జీవుని – మనస్సుని స్వాధీన పరచుకుంటాము. అందుకే ఇవి సాధన మంత్రాలు అయ్యాయి. జీవుడు 128 తత్వాలతో కూడుకున్నాడు. దాని ప్రత్యమ్నాయమే 128 పూసలు గల జపమాల అయింది. మన దగ్గరున్న 64 పూసలున్న జపమాల రెండుసార్లు త్రిప్పితే 128 స్మరణలు స్థూల దేహములో ఉన్న జీవుడు స్వాధీనము కాగలడు

ఓం - న - మ - శి - వా - య

ఓం - మ - శి - వా - య - న

ఓం - శి - వా - య - న - మ

ఓం - వా - య - న - మ - శి

ఓం - య - న - మ - శి - వా - గురువేనమః

**ఇది ప్రణవ పంచాక్షరి**

అంటూ జపము చేయ్యాలి. దీని జప సూత్రము. గురుముఖంగా తెలుసుకోవాలి. అదే విధముగా అష్టాక్షరీ మంత్రం సాయం సంధ్యలో జపించాలి. ఆ మంత్రం ఇది :

ఓం - న - మో - నా - రా - య - ణా - య - ఇది అష్టాక్షరీ

ఇక, గురుమాలామంత్రం కూడా జపించాలి. దీనిని పూర్ణభావము పొందిన తరువాత నిత్యానుష్ఠానమునకు ముందు పఠించాలి. ఎందుకంటే - ఎరుక సాధనలు అయిపోయిన తరువాత గురు వాక్యానుసారంగా గురుదక్షిణగా ఎరుక దారపోస్తాము. ఇక శిష్యుని దగ్గర జపమాల ఉండదు. పంచాక్షరీ, అష్టాక్షరీ పఠించడానికి అవకాశం ఉండదు. అంతమాత్రాన సద్గురువుని మరచిపోవాలని లేదు. సద్గురువే పూర్ణభావానికి త్రోవ చూపిస్తారు. కాబట్టి గురుని చెంత నిరామయునిగా ఉండడానికి గాను, గురుభక్తి పెరగడానికి గాను "గురుమాలామంత్రము" కరన్యాసము - హృదయన్యాసముతో చెయ్యమని పూర్వీకులు ఈ మంత్రం ప్రవేశపెట్టారు. భక్తునితో ధృఢభావం కలిగించడం గురువుగారి కర్తవ్యం.

**గురుమాలా మంత్రం**

ఓం నమః శ్రీగురుదేవాయ - పరమ పురుషాయ - సర్వదేవతా వశీకరాయ - సర్వారిష్ఠ వినాశనాయ - సర్వమంత్రచ్ఛేదనాయ - త్రైలోక్యం వశమానాయ - స్వాహా - స్వాహా - స్వాహా

**కరన్యాసము**

ఓం-హం-సాం-సూర్యాత్మనే - అంగుష్ఠాభ్యాం నమః (బొటనవ్రేలు తాకాలి)

ఓం-హం-సీం-సోమాత్మనే - తర్జనీభ్యాం నమః (చూపుడు వ్రేలు తాకాలి)

ఓం-హం-సూం-నిరంజనాత్మనే - మధ్యమాభ్యాంనమః (మధ్యవ్రేలు తాకాలి)

ఓం-హం-సైం-నిరాభాసాత్మనే - అనామికాభ్యాంనమః (ఉంగరపు వ్రేలు తాకాలి)

ఓం-హం-సౌం-సూక్ష్మాత్మనే - కనిష్ఠకాభ్యాంనమః (చిటికెన వ్రేలు తాకాలి)

ఓం-హం-సః-అవ్యక్తాత్మనే-కరతల కరపృష్ఠాభ్యాంనమః (అరచేతి మధ్య తాకాలి)

ఆ తరువాత వంశపరంపరధ్యానం, లఘుపూజ, పరిపూర్ణ ధాన్యము, పరాపూజ, చదివి ద్వాదశి షోడశి, పంచదశి మంత్రాలు వల్లించాలి. అప్పుడు నిత్యానుష్ఠానము పూర్తి అవుతుంది. ఈ మూడు మంత్రాలు "శోధన మంత్రాలు" గా భావించి, మంత్రము - మంత్రార్థము - మంత్రసారము - మంత్రరహస్యము అను నాలుగు మార్గాలు గురుబోధ ద్వారా శోధించాలి.

ఇపుడు మంత్ర విధానం గురించి చర్చిస్తాను. మంత్రములో అనగా సాధనమంత్రాలలో ముఖ్యమైన బీజాక్షరము నిక్షిప్తమై వుండాలి. ఆ బీజాక్షరము లేని మంత్రమునకు ఫలితముండదు. ఆ విషయమే ఇపుడు చర్చిస్తాను.

ప్రపంచము పంచభూతాలతో ఏర్పడింది. అందుకే పంచబీజాక్షరాలున్నాయి.

1. లం-అనే బీజాక్షరము పృధివి వలన కలిగింది. దీనిని గంధముతో పూజ చేయాలి.
2. హం-అనే బీజాక్షరము ఆకాశము వలన కలిగింది. దీనిని పుష్పములతో పూజ చేయాలి.
3. యం-అనే బీజాక్షరము వాయువు వలన కలిగింది. దీనిని ధూపము వేసి పూజచేయాలి.
4. రం-అనే బీజాక్షరము అగ్ని వలన కలిగింది. దీనిని దీపంతో అర్చించాలి.
5. వం - అనే బీజాక్షరము జలము వలన కలిగింది. దీనికి నైవేద్యం పెట్టాలి.
6. సం - అనే బీజాక్షరము సర్వాత్మకు చెందినది. దీనికి సర్వోపచార పూజ సమర్పణ చేయాలి.

**అనగా** లం-హం-యం-రం-వం- అనే బీజాక్షరాలు పంచభూతాలకు సంబంధించినవని, సం- అనేది ఆత్మకు సంబంధించినదని గుర్తెరగాలి. ఈ పంచ బీజాక్షరాలలో "యం" అనే బీజాక్షరము ప్రతి మంత్రములోనూ కనిపిస్తుంది. అవి పరిశీలిద్దాం -

**పంచాక్షరి** : ఓం నమశివాయ - ఇందులో "య" కారముంది

**అష్టాక్షరి** : ఓం నమోనారాయణాయ - ఇందులోను "య" కారముంది

ఓం నమో వేంకటేశాయ - ఇందులోనూ య కారముంది

ఓం నమో వాసుదేవాయ - ఇందులోనూ..............

(ఈ రెండు సగుణారాధనకుల మంత్రాలు అయినా బీజాక్షర మొక్కటే) గురుమాలా మంత్రములోను, 'య' అనుబీజాక్షరమున్నది.

శ్రీ గురుదేవాయ - 'య' బీజాక్షరముంది.

పరమ పురుషాయ -'య' బీజాక్షరముంది.

సర్వదేవతావశీకరాయ - 'య' బీజాక్షరముంది.

సర్వారిష్టవినాశనాయ - 'య' బీజాక్షరముంది.

సర్వమంత్రచ్ఛేదనాయ - 'య' బీజాక్షరముంది.

"ఓం" అనే ప్రణవము ముందుకు తగిలిస్తూ "యం" అనే బీజాక్షరము చివరన చేర్చడం బట్టి ఈ మంత్రాలకు "ప్రాణప్రతిష్ఠ" జరిగి మంచి ఫలితాలు యిస్తావి. ఓంకారము వలన మంత్రము శుద్ధాత్మ అయి శుద్ధచైతన్య రూపము ధరిస్తుంది. అపుడు "యం" అనే బీజాక్షరము వాయువు వలన కలిగినది. కాబట్టి వాయు సంచలనము వలన "ప్రాణ ప్రతిష్ఠ" జరుగుతుంది. అపుడు మంత్రమే దైవత్వము దాల్చుతుంది.

మంత్రాలకు వశీకరణ శక్తి కూడా ఉన్నది. అవి "క్షుద్ర దేవతారాధనకు" వినియోగిస్తారు. దానికి "హం" బీజాక్షరము అవుతుంది. అలాంటి మంత్రాలు మనం పఠించకూడదు. దేవీ పూజలకు కూడా మంత్రాలున్నాయి. కాని, మనము ఆత్మ సంభరితమైన మనస్సు-బుద్ధి-చిత్తము, అహంకారము (అనగా "నేను" అనే స్ఫురణ) అను నాలుగు అంతరింద్రియములు మన స్వాధీనములోనికి తెచ్చుకొనడానికి గాను ఈ మంత్రములు - మంత్రసాధనలు - మంత్రమర్మములు తెలుసుకొంటే చాలును. ఆ తరువాత ఈ అంతఃకరణముల సహాయముతో పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శించి, తాను లేని స్థితి పొందవలెను. కాబట్టి పరిపూర్ణ మంత్రాలు పరిశీలిద్దాం. ఇవి శోధన మంత్రాలే కాని, సాధన మంత్రాలు కావు. అందుచేత అవి నాలుగు విధాలుగా శోధించాలి.

**ద్వాదశి : అయం వ్యర్థ బాహ్యకోపీ నభవతి** - ఇది మంత్రము

**ఈ యుత్త బట్టబయలేమియు లేదు** - ఇది మంత్రార్థము

**మంత్రసారము :** బోధరూపముగా గురువు చెప్పాలి. బట్టబయలే బ్రహ్మము. జనన మరణాలు లేనిది, అంతటా నిండియుండి సూదిమొన మోపుటకు కూడా సంధులేక, ఆది అంత్యములేక, సృష్టికి ముందునను, మహాప్రళయాంతమునను. కదలక-మెదలక - ఏ మాత్రం చలించక యున్నదే బయలు అని ధృఢీకరించాలి.

**మంత్రరహాస్యము :** ఇదే గురుసూచన, గురుసొజ్ఞ దీనిని అపరోక్ష జ్ఞానము వలన అంతరంగములో ధృడపరచుకోవాలి.

**2. షోడశి : మూలాభావ మిదం జ్ఞాతం శరీరం కిమునాస్తిహి** - ఇది మంత్రము

**మూలములేని గుర్తెరుగు శరీరమేమి లేదు** - ఇది మంత్రార్థము

**మంత్రసారము :** బోధ రూపముగా ఉండాలి. సర్వమూ గుర్తెరుగు చున్నది జ్ఞాత ! జ్ఞానము అనే శక్తివలన జ్ఞేయమును గ్రహించి, జ్ఞాతగా మారుచున్నది. దీనినే ద్రష్ట అంటారు. ద్రష్టకు దృక్కు దృశ్యము తోడ్పడుతుంది. అయినప్పటికీ మూల సూత్రధారి జ్ఞాత అనే సర్వము గుర్తించేవాడే అని తెలియాలి. దానినే ఎరుక అని అంటారు. దీని స్వస్థానము, భ్రూమధ్యము. దీనినే సచ్చిదానంద పరులు ప్రజ్ఞానాత్ముడు అని అంటారు. అయితే ఈ ప్రజ్ఞానాత్ముడు అనే ఎరుక

ఎక్కడి నుంచి వచ్చిందని ప్రశ్నించుకొంటే అది శుద్ధచైతన్యమైన శుద్ధ ఎరుక నుంచి ఉత్పన్నమైనట్లు తెలియబడుతుంది. అటువంటి శుద్ధ ఎరుక తనకు తానే వచ్చిన స్వయంభవుడు కాబట్టి దానికి ఆధారము కాని, మూలము కాని లేదు. అందుకే చావు పుట్టుకలు కలుగుతున్నాయి. తల్లికే ఆధారములేనపుడు, పిల్లకు ఆధారముండదు. అందుచేత దీనికి మూలము లేదు. మూలము లేకనే గుర్తెరుగుతున్న యీ ఎరుకకు అనగా నీవు గుర్తిస్తున్న జ్ఞాతకు కూడా మూలములేదు. కావున నీవు కూడా మూలములేనివాడవు. మూలము లేదు కావున నీకు మరణము తప్పదు. అని మూలము లేని గుర్తెరిగే శరీరము గురించి బోధించాలి.

**మంత్ర రహస్యము :** ఎరుక (ఆత్మ) దర్శనము కావాలి. 'నేను' అనే స్ఫురణ ఎలా కలుగుతుందో ఎరిగించాలి. దాని నివారణ గురించి పరబ్రహ్మము దర్శింపజేయ్యాలి.

**3. పంచదశి :** **స్వప్నే ప్రతీయ మానాని రూపాణి యథాతథా** – మంత్రము
**కలలో మేల్కొన్న శరీర మేలాగో అలాగే** – మంత్రార్థము

**మంత్రసారము :** కలకు – మెలకువకు; జాగ్రదావస్థకు – స్వప్నావస్థకు; ఏది కేంద్రబిందువై రెండు విభిన్నమైన స్ఫురణలు కలిగిస్తుందో, ఆ కేంద్రములో ఉత్పన్నమైనదే భ్రాంతి అనే లక్షణం అని ప్రస్ఫుటము చెయ్యాలి. దానికి దృష్టాంతమే స్వప్నము అదే మాయ !

**మంత్రరహస్యము :** కూర్పురం కళిక కూడితే ఎలాగో అలాగే సర్వశూన్యము – ఏమీలేదు. జ్ఞానము వలన భ్రాంతి లక్షణం ఎరిగి, ఆ తరువాత, భ్రాంతిని జ్ఞానమును విడచిపెట్టుట.

ఈ విధముగా అతీత మహామంత్రాలు శోధన చెయ్యాలి. దీనికి గురుశిష్యుల అన్యోన్యమైన భక్తి – అనురక్తులు వుంటేనే గాని ఫలితము దక్కదు. బోధపడదు. ఇక, పరిపూర్ణభావ స్మరణ కోసం వ్రాస్తాను. పరిశీలించాలి.

**శ్లో॥ నమో బ్రహ్మాదిభ్యో – బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో**
**వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః**

దీని అర్థము : నమో = నమస్కరించుచున్నాను. బ్రహ్మ = బట్టబయలైన బ్రహ్మము. ది+భ్యో=నకు, (భ్యో అనునది విభక్తి ప్రత్యయమునకు – అని అర్థమిచ్చుచున్నది)

తాత్పర్యము : బట్టబయలైన బ్రహ్మమునకు, అటువంటి బ్రహ్మ విద్య నభ్యసించి, అదే తన కర్తవ్యముగా భావించిన వారికి, గురువంశ ఋషీశ్వరులకు, మహనీయులైన గురువులకు నమస్కారము.

**శ్లో॥ సర్వోపప్లవరహిత ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో । బ్రహ్మైవాహమస్మి అహం పదార్థ రహితః ॥**

**అర్థము :** సర్వోప = సర్వమున్నూ, ప్లవ = మాయ, ఘన = ఆకాశము, ప్రత్యగర్థో = ప్రత్యగాత్మ,
బ్రహ్మైవ = బ్రహ్మమై, అహం = నేను, అస్మి = అయివున్నాను.

**తాత్పర్యము :** సర్వమునూ ఆవరించియున్న మాయను విడచిపెడితే, ఆకాశ తత్వమైన జ్ఞానశక్తితో కూడిన ప్రత్యగాత్ముడనై వున్నాను. అందులో మిగిలియున్న అహం అనగా నేను అనే స్ఫురణ కూడా రహితమైనపుడు, నేను ఏమీ లేని బట్టబయలైన బ్రహ్మమును అగుచున్నాను. అని అర్థము. అనగా ఎరుక సంబంధమైనది ఏదీ లేక పోతే – మిగిలేది బ్రహ్మము అనే బట్టబయలే అని అర్థము,

ఇంతవరకు అనుభవ పూర్వకంగా వ్రాశాను. భక్తులకు పనికి వస్తుందని భావిస్తున్నాను.

భక్తజన శ్రేయోభిలాషి
**క్షరాక్షర విలక్షణ మోసాచక్రపాణి ఆచార్యులు**
**విశాఖపట్నం**

*Sri Nitya Satya Saswithathithachala Vyardha Bahya Bramhane Namah*







# THE GLORIOUS GOLDEN ACHALA GURU MANDIR OF SRIMATH PHILKANA LAXMAN DESIKA PRABHU

Dearly beloved Achala Gurus and paripurna Bhavajnas !

A strong will power of determined mind reconstructed,
As powerful golden Achala Guru Mandir
Almightly "Philkana Laxmana Desika Prabhus" gift,
As graceful Manohar,
Blue Lotus feet of Desika Prabhu divinely shines
As delightful Manihar
Bramha bramethi parabrahma swarupa blessings rebuilts,
As beautiful Bhuvana Giri
Countless effort of Mandir Committee is far comparable,
As wonderful Simha Giri
Conciousness of Preachings of Achala Sidhanta is luminously lighten
as cheerful Ratna Giri
Divinely blessings of prabhus are victory
As successful golden piece.
Egoism of individuals lashed the history is now in our hands,
As peaceful diamond piece
Efficient Engineers magnituded the mandir by the"Supreme Power"
As skillful master piece.
Kindness of spiritual aspiration of Samisthi Bodhananda, Sodasi Vilakshana Swamy,
Stands faithfully forever
Keyed up systematically to satisfy all, the "Achala Sidhanta"
Broadcast loudly forever
Let us forget the past and accept the Mandir whole heartedly.
With truthful relationship.
Let us sicnerely preach and spread the Branthi Rahita Marg,
With hopeful wearness of mind to worship
Peaceful co-existence strengthend the mind to inspire
With careful co-operation towards Mandir
Universal Supreme Gurus with their divine love and blessings are always on us,
By the grace of the Mandir
Youngsters are to listen and learn to lead the future for the uplift of the Mandir,
By the guidance of elders.
om Santi ! Santhi ! Santhih !



## The divine Golden Memories of
# Srimath LaxmanA deshika parbhu



Prajnana Vilakshana
**B. GOPAL BABU**
Retd. Rly. Engineer & Officer, SE Rly,
President, Achala Bodhacharya Sree Bheempalli
Gaddeyarya Kendra Bhakta Samajam
Visakhapatnam.

On the pious occasion of 100 years of Celebration of Rajadi Raja Yogendra Srimath Philkhana Laxmana Prabhu with Shatakoti Spiritual divine Dwadasi Pranamas.

It is glorious day of meet and to celebrate

100 years Celebrations of Aradhana of Laxmana Prabhu

It is the Golden days of Laxmana Desika

to remember is Auspcious

It is the divinely precious to meditate in our life

and to respect in out life.

It is the greatest day of supreme power

to respect in out life

The life long golden service to all Achala Gurus

with Achala Thatva Siromani Achalananda Mala is Tremendous,

The away of preachings of Bhakti Jnana of

Sujnana Theetardha Thatva Akhanda Mala is Marvelous.

The divinely dignify of right status of Achala

Jnana of Thatva Pradhodanasa are Virtuous

The decent philophical preachings of Thatvas

are to inspire and to follow Achala Sidhanta is luninous.

The Spiritual thoughts and deeds to the discipless are endless

The divinely affectionate bosom love to all is countless

The divine Mangala Swaroopa with peace and

Calm is always attraction of surrender us.

The supreme Guru of philosophical Thatva Jnana is always in circle among us

Let us always follow the supreme ideal foot steps

Let us always respect the supreme power with unity

Let us always honour the golden Mandir

without egoism of spiritual Bhakti.

Let us always keep the Achala Sudhanta of Supreme with

peace and calm approach to all.

**Last by**

**The divya charanas of sadguru prabhu pad padmanas are swarami swarami**

**The devadi deva of supreme Laxmanarya Deva is always namami namami**

**Sarvam Laxmanarya Charanara Vindarpanamasthu**

# The Prayer for Achala Sadguru

The prayer is the closest direct feature of communion with Sadguru.
The prayer is the best bridge between disciple and gurus.
The prayer is the silent expression of infinate gratitude towards sadguru.

The prayer is the honest purifier of mind with the Guru
The prayer luminates the boundless love and supreme wisdom of Sadguru
The prayer protects in increases the power of meditation of ominipotent of Guru

The prayer is the instrumenet of divine love and Bakti towards sadguru
The prayer is the best consciousness to attain through guru.
The prayer is the oneness of dhyana of Sadguru Swaroopa of gain awakeness.
The prayer the supreme consciousness of spiritual enlightment of Sadguru.

**Sarvam Sadguru Charanaravindrapanamasthu.**

Prajnana Vilakshana
**B. GOPAL BABU**
Retd. Rly. Engineer & Officer, SE Rly,
President, Achala Bodhacharya Sree Bheempalli
Gaddeyarya Kendra Bhakta SamajamVisakhapatnam.

# మనోవేదన

అప్పుడప్పుడు ఆలోచిస్తుంటే అనిపిస్తుంది,
మనం మానవ మాత్రులమేనా !
మనలో ఉన్నది గురు స్వరూపమేనా !
ఎందుకంటే... అన్ని వేళలలో గురుస్మరణే
మన గురించి ఆలోచించ లేకపోతున్నాం,
విధిగా మనలను అచల గురువులమని అంటారు
వేరుగాని కలసికట్టుగాని జీవించలేకపోతున్నాం,
మనకున్నది వ్యక్తివం.
నీచులుగా మారిపోతున్నాం.
వ్యక్తిగా కలిసిన సమాజవ్యక్తి
మూడమతిగా కరిగిపోతున్నాం.
లోకానికి మనం అచలగురువులుగా మారుతున్నాం.
గురు స్వరూపంలో తెరిచిచూస్తే
అంతా సూన్యం... మిగిలేది ఏమీలేదు
ప్రియతమా!... గురునేస్తమా !
గ్రహించినది లక్ష్మణ ప్రభువుల తత్వం,
నడిపించినది లక్ష్మణదేశిక అమృత దృష్టి
మంచిగా నడిపించునది మనలక్ష్యం,
నా మనోవేదన నీ ఆత్మీయత
ఆవేషమే అహంకారంనకు దారి
సహనమే శాంతికి బాట
మరొకమారు ఆలోచించు
నా మాట నమ్మి
భ్రాంతిని విడిచి జన్మరాహిత్యం పొందాలి.

శ్రీ ప్రజ్ఞాన విలక్షణ భీంపెళ్ళి గోపాల్‌బాబు
విశాఖపట్నం



## శ్రీ సద్గురువేనమః

**2. కందపద్యము : మాటలేనట్టి బయలున । మాట గలిగె ననుట వినుట మాయ గదయ్యా
మాట మాయైతె మానెను । మాటను మాటాడి మనము మానుదమవలన్ ॥**

మాటలేనట్టి బయలున ఒక మాట కలిగినదని, అట్టి మాటను అనుచును । వినుచును యుంటే అదియే "మాయ" యని చెప్పదగును. కావున అట్టి మాట అను మాయను విచారించి, ఆ తర్వాత మనము మానుకుందామని శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు తెలిపినారు. అందుచేత మాయ యొక్క పుట్టు పూర్వోత్తరములను విచారించుదాము.

"మాయ" యనగనే లేనిదని అర్థము., అయినను అట్టి నా మాయసత్తని, చెప్పదగదు. సత్తయినయెడల మూడు కాలముల యందును బాధింపబడదు. అనగా మూడు కాలములయందుండవలయును. మాయ బ్రహ్మజ్ఞానము చేత తొలుగుచున్నది. కాబట్టి మాయసత్తనుటకు వీలుబడదు. మాయను అసత్తనుటకును వలనుబడదు. అసత్తనగా మూడు కాలముల యందును లేనిది. మాయ యిట్లుకాదు "నేను అజ్ఞుడను" అను అనుభవమున్నది. కాబట్టి అసత్తనుటకు వీలులేదు. పరిశీలించి చూడగా, నెందునుగాని ఒక్క వస్తువు సత్తుగను, అసత్తుగను నుండు ననుభవము లేదు. కాబట్టి సదసత్తనుటకు లేదు. అందుకే శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు **"సదసద్రహితం"** అని కందార్థములో తెలిపినారు. అనగా మాయ సత్తు అసత్తులు కాదని నిరసించారు. అయినను దీనిని పూర్తిగా విచారించిననే గాని మాయయొక్క వివరము క్షుణ్ణంగా తెలియగలదు.

ఆ మాయ, యవయవములు లేనిదనుటకు లేదు. ఆ మాయ జగత్ స్వరూపముగా, గానుపించు చున్నది. స్వరూ[illegible] మెప్పుడు, సావయవము, కాని నిరవయవము కాదు. కాబట్టి మాయ నిరవయవ, మనుటకు లేదు. అట్లని, మాయ సావయవము అనగా, అవయవములలో గూడినది అనుటకును లేదు. మాయ స్వరూపమయిన ప్రపంచము గాఢ సుషుప్తి యందు నశించినప్పటికిని మాయ నశింపకున్నది. ఆ కారణము చేత మాయ సావయవమని అనుటకు వీలులేదు. నా మాయ సావయవము నిరవయవమును అని చెప్పుదమన్న అట్లనుటకును లేదు. ఒక్క వస్తువు ప్రత్యక్షము అయిన రెండు ధర్మములను బొందదు. కాబట్టియే, మాయ సావయవ, నిరవయవ, మనుటకు లేదు. అనగా మాయ సత్తుగాను, అసత్తుగాను సదసత్తుగాను, నిరవయవమును గాదు. సావయవమును గాదు. అనగా నిరవయవ సావయవములునుగాదని తెలియుచున్నది.

నేనున్ననే మాయ యున్నది. కాబట్టి మాయ నా కంటే భిన్నమనుటకు లేదు. నేను నిష్క్రియుడ ననుట చేతను జ్ఞాన స్వరూపుడనగుట చేతను మాయ జగత్తు ఆరంభాది క్రియలు గల దగుటచేతను జ్ఞానస్వరూపము కాదు. కాబట్టి నాకంటే భిన్నమయినదనియే చెప్పవలయును. ఇందు చేత మాయ యవాచ్యమనిరి. అపరోక్ష జ్ఞానము చేత జూడ ఈ మాయ తుచ్ఛముగ నున్నది. పదార్థ విజ్ఞాన ప్రదమైన యుక్తి శాస్త్రముచేత విచారింప మాయ స్వరూప మేర్పడకున్నది. లోకదృష్టిచేత నాలోచింప మాయకు అంతములేకున్నది.

అయినను **"మాయాచా విద్యాచ స్వయమేవభవతి"** అని శృతి యున్నది. స్వయమేవయనగా జగత్తు యొక్క మూలప్రకృతి తానే మాయ రూపమై అవిద్యారూపమైయున్నది. శుద్ధసత్త్వ ప్రధానము మాయయైయున్నది. మలిన సత్త్వ సహితమై అవిద్య యున్నది. మాయ యందు ప్రతిబింబితుడు ఈశ్వరుడైయున్నాడు. అవిద్యా ప్రతిబింబితుడు జీవుడైయున్నాడు. ఈశ్వరునకు ఉపాధి యగు మాయ యొక్క సత్త్వము శుద్ధమైనందున నీశ్వరుడు సర్వజ్ఞుడైయున్నాడు. జీవునకు ఉపాధియగు అవిద్యయొక్క సత్త్వము మలినమైనందున జీవుడు అల్పజ్ఞుడై యున్నాడు. మరియు ఈశ్వరుని యందు ఆవరణము లేనందున ఈశ్వరుడు సదాముక్తుడుగా యున్నాడు. జీవుని యందు ఆవరణముండుటవలన జీవుడు బద్ధుడైయున్నాడు. ఏలయనగా అవిద్యా అంశమందు కలిగిన చైతన్యా బాసంబునకు జీవుడని పేరు. అవిద్యకు ఆవరణమగుట స్వభావమై యున్నది. అవిద్యా, అజ్ఞానము మాయ ఇవి ఒకే వస్తువునకు అన్వయమైనను శుద్ధ సత్త్వ గుణ ప్రధానము వలన మాయ యనియు మలిన సత్త్వ గుణ ప్రధానము వలన అజ్ఞానము అవిద్యయనియు చెప్పబడును. గురుగీత అందలి శ్లోకము. **గూఢావిద్యా జగన్మాయా, దేహశ్చా జ్ఞాన సంభవః** లోకము అతిరహస్యమైన అజ్ఞానస్వరూపమగు ప్రకృతిగా యున్నది. దేహము పరబ్రహస్వరూప జ్ఞానము లేకపోవుట వలన కలుగుచున్నది. మరియు **"గుకారః ప్రథమోవర్ణో మాయాది గుణ భాసకం"** గురుపదమందలి మొదటి వర్ణమగు గుకారము మాయ మొదలైన గుణములను ప్రకాశింపచేయుచున్నది. ఆ మాయ సమిష్టి, నిద్రాస్వరూపమనియును జగద్వాసనా స్వరూపమనియును త్రిగుణ స్వరూపమనియును సకల ప్రాణుల దనయందుంచుకున్నదనియును జడస్వరూపమనియు భ్రమ స్వరూపమనియు లోకమున ఉపాదానకారణమనియును, ఆ మాయనే అవిద్యయనియును అవ్యక్తమనియును తమస్సనియును, సుషుప్తియనియును, ప్రకృతియనియును ప్రళయమనియును, ప్రధానమనియును, అజ్ఞానమనియును అందురు.

**శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం । భ్రమేణోపాసకా జనాః ।**
**భ్రమేణేశ్వర భావత్వం భ్రమమూల మిదంజగత్ ॥**

తా॥ భ్రాంతిచేతనే నీవును, నేనును, నీవును భ్రాంతిచేతనే ఈశ్వరోపాసన చేయునట్టి జనులును భ్రాంతిచేతనే యీశ్వర భావము గలుగు చున్నది. ఆజగత్తు భ్రాంతి వలననే యున్నదిగాని, నిజముగా లేదని భావము.

ఈ ప్రకారముగా, మూల ప్రకృతి రెండు విధములుగానున్నది.

ఆ ప్రకృతి 1) పరాప్రకృతి యనియును 2) అపరాప్రకృతియనియును అందురు. ఇది అచేతనరూపమైనది. రెండవదియగు పరాప్రకృతి సర్వప్రపంచమును ధరించుచున్నది.

**శ్లో॥ అబీజం వృక్ష సంపన్నం । శాఖాపల్లవ వర్జితం ।**
**పుష్పంనాస్తి ఫలంనాస్తి । సంపూర్ణ వృక్ష వర్జితం ॥**

1. అవ్యక్తము 2) మహత్తు 3) అహంకారము 4) పృథ్వి 5) జలము 6) అగ్ని 7) వాయువు 8) ఆకాశము అను యెనిమిది విధములైన మహా ప్రకృతులే బ్రహ్మాదిస్తంభ పర్యంతముగా నుండెడు. సమస్తాకారములాయెను. ఈ యాకారములనెడు బీజ రహితమైన వృక్ష సమృద్ధి । కొమ్మలు । చిగుళ్లు । పుష్పములు । ఫలములు లేనిదై శరీరాత్మలనెడు వృక్షములు లేనిదై యుండినను. భ్రాంతివలన దోచు చుండును.

ఏటులనగా, త్రాటిని చూచి, పామనుకొని భీతినొందుటయు । మోదునుగని యెవరో మనుష్యుడనుకొనుటయు । ముత్యపు చిప్పయందలి మెఱుపును జూచి, వెండి యనుకొనుటయు । ఎండమావులను జూచి మంచి నీరనికొని త్రాగజనుటయు । ఏరూపములేని యాశాకమును, నల్లనిదిగా జూచుచుండుటయును, అందఱకు అనుభవమే. ఎందువలన అట్లు ఒక వస్తువు, మఱొక వస్తువునుగా గాన్పించుచున్నది. అజ్ఞానము వలన, గలిగిన భ్రమచేత, ఆభ్రమ తొలగగనే, వస్తువు యొక్క యధార్థ స్వరూపమే కనబడును. అందుకు శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు, "యెరుకోత్పత్తిలక్షణములో"

**కందార్థము : లేనెరుక బయలులోపల । తానెట్లుజనించెననిన, తగవిను వంధ్యా । సూనుని గతి, వియదబ్జ వి ।ధానంబున యక్షరాజ । దానీ విధమున్న । రజ్జువు సర్పమైనా విధమున్న । స్థాణుపూరుషుని చందాన మృగజల । శశివిషాణము స్వప్నానందముగ । రాజదాని విధమున్న । రజ్జువు సర్ప ।మైన విధమున్న ॥ అన్నట్లు**

ఈ ప్రకారముగానే, అద్వయుడగు నేను బహురూపములుగను, సత్తుగను, అసత్తుగను, చిత్తుగను, జడముగను, ఆనందమగునేను, దుఃఖముగను, అనగా **"సచ్చిదానంద స్వరూపుడగు నేను"** అసజ్జడ, దుఃఖాత్మ మయిన ప్రపంచముగా, మాయ వలనదోచుచున్నది. ఆమాయ తొలగిన, నాయథార్థస్వరూపము కనుపించునే కాని । అనృతజడదుఃఖాత్మకమయిన ప్రపంచమెంత మాత్రము తోచదు.

**గురుగీత యందు :**

**శ్లో॥ అజోహ మమ రోహంచ । అనాదినిధనోహ్యహం ।**
**అవికారచ్చిదానందో । హ్యణీయాన్ । మహతోమహాన్॥**

**శ్లో॥ అపూర్వమపరం నిత్యం । స్వయం జ్యోతిర్నిరామయం ।**
**విరజం పరమాకాశం । ధ్రువమానందమవ్యయం ॥**

**శ్లో॥ అగోచరం తథాగమ్యం । నామరూపవివర్జితం ।**
**నిశ్శబ్దంతు విజానీయా । త్స్వభావాద్బ్రహ్మపార్వతీ ॥**

తా॥ నేను జననమరణములు లేనివాడను । ఆద్యంతములు లేనివాడను । వికారములేనివాడను । చిదానంద స్వరూపుడను । అణు స్వరూపుడను । మహత్స్వరూపడనైయున్నాను. ఓ పార్వతీ । పరిపూర్ణ బ్రహ్మము పూర్వాపరములు లేనివాడు. శాశ్వతుడు స్వయంప్రకాశమానుడు. నిరామయుడు పాప పుణ్యములు లేనివాడు, శ్రేష్ఠమగు చిదాకాశస్వరూపుడు, నిత్యుడు, ఆనందాతీతుడు, నాశము లేనివాడు. దృశ్యాదృశ్యములు కానివాడు. నామరూపములేనివాడు. సదాశబ్ద రహిత మైనవాడు. దీనికే భద్రాద్రి రామశతకమునందు శ్రీ పరశురామ నరసింహ్మదాసు గారు నేతినేతి మహావాక్య లక్షణములో

సీ॥ నీవు పృథివియు గావు । నీరగ్నులు గావు । పవనంబు గావు । వ్యోమంబు గావు । శ్రోత్రత్వక్కులుగావు । నేత్రజిహ్వలుగావు । ఘ్రాణంబు గావు వక్త్రంబుగావు । పాణిపాదోపస్థపాయువులును గావు । ప్రాణముల్గావు శబ్దంబుగావు। స్పర్శరూపులుగావు । పరగరసమును గావు । గంధంబు గావు । చిత్కళలు గావు ॥ గీ ॥ మానసాదులును గావు । కర్మములు గావు । సచ్చిదానందరూపాత్మసాక్షినీవు । రమ్య ॥

**"సకల సమయసృష్టి సచ్చిదానంద దృష్టి । ర్నివసతుమయి నిత్యంశ్రీ గురోర్ధివ్యదృష్టిః ॥**

సమస్తములైన నియమములను । సృజించునదియును సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మయందు చూపుగలదియును అగుసద్గురు యొక్క స్వప్రకాశమగు చూపు ఎల్లప్పుడు నాయందు యుండుగాక ॥

ఇప్పటి వరకు మాయ యొక్క పుట్టు పూర్వోత్తములను విచారించి అట్టి మాయ (పరిపూర్ణపరబ్రహ్మమునందు) ఈ వృత్తబట్టబయలు నందు ఎన్నడులేనిదేయగును. అందుచే దీక్షితీయము నందు శ్రీ శివరామదీక్షితుల వారు ఎరుకపుట్టనే లేదనిరి ఎందుచేతననగా పుట్టినదనియంటే, ఇంత విచారణ చేయవలసివచ్చును. అందుచే మొదటే లేదనిరి

**మాయ దెలియరాదు । మాయమూలములేదు । మాయ వాయురూప మాయ మమత ।**
**మాయ వలన బుట్టె మహదహంకారంబు । అఖిల జీవసంగ ఆత్మలింగా ॥**

ఎరుకను త్రికాలముల యందు లేదనడానికే, ద్వాదశి, షోడశి, పంచదశి అను మూడు వాక్యములను చెప్పిరి.

**1. ద్వాదశి : "అయంవ్యర్థః బాహ్యఃకోపినభవతి"** ఇది అనంతోపనిషత్తు నందు తెలిపిరి.
దీని యొక్క అర్థము "ఈ వుత్తబట్టబయలుయేమీ లేదు"

**2. షోడశి : మూలభావ మిదంజ్ఞాతుమ్న శరీరం, నకిమస్తి** " ఇది సర్వసారపూర్ణోపనిషత్ నందు తెలిపిరి.
దీనియొక్క అర్థము – మూలం లేని యీ గుర్తెరిగె శరీరం యేమీ లేదు.

**3. పంచదశి :** దృష్ట ద్రాష్టాంతం

**శ్లో॥ స్వప్నే ప్రతీయ మానాని రూపానిచయథాతధా ।**

**అర్థము : కలలో దోచిన శరీరా లేలాగో అలాగే ॥ దృష్టాంతము**

**ద్రాష్టాంతం : కర్పూరము కళిక కూడితే యేలాగో, ఆలాగే ॥**

పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎరుకకు మూలముగాని, స్థానము గాని, స్వరూపముగాని ఎచ్చోటను కనుపించనందున ఇదిలేనిదనియే చెప్పవలసివచ్చినది. స్వరూపము కలిగిన వస్తువు, ఎప్పటికైనను, కోట్ల సంవత్సరాలకైనను, నశింపక తప్పదు । కావున భగవద్గీత 8వ అధ్యాయములో త్రిమూర్తుల జీవితకాలమును, అక్షరుని కాలమును నిర్ణయించిరి. పంచభూతలయమును కూడ నిర్ణయించిరి. ఇన్ని విధాల చేతను ఎరుక ఎప్పటికైనను స్థాన స్వరూపములు లేకుండ విలీన మౌతుంది. ఈ వుత్తబట్టబయలే శాశ్వతపుది. దీని ఉనికి అనుభవజ్ఞులకే అనుభవము. శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు కందపద్యములో **చెప్పిచూపించరానిది యప్పాయల్లదిగో చూడుమనినేనీకున్ । చెప్పి చూపిస్తి మరువకు । యెప్పటికిది నమ్మిలేని యెరుకను విడరా ॥** చెప్పరానిదియు । చూపించరానిదియు చెప్పితి । చూపించితి. **"అల్లదిగో"** అని అన్నాడు. ఎక్కడయున్నదో నిర్ణయము లేకుండా యున్నది. గురు సూచన । గురుసేవ చేతనే అట్టి ఉనికి అనుభవజ్ఞులకే నిర్ణయమగును. **ఉనికి గలిగిన యట్టి ఘనుని సన్నుతి జేయ । జనులాకుశక్యమంచన రాదు ।** అని సెలవిచ్చారు. తాను లేనిదే పరిపూర్ణము । తాను యుండగా ఎన్నటికి పరిపూర్ణముగాదు. అందుచేతనే **"మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు"** అని షోడశిని బోధించి, స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములు లేనిది తాను లేదనే భావము స్ఫురించుతుంది.

అందుచేతనే మాయను విచారించి **"మనము మానుదమువలవన్"** అనగా చెప్పడానికి గురుడు కాని, వినడానికి శిష్యుడుకాని ఇద్దరు లేరని ఆకంద పద్యము యొక్క భావము. కావున **కర్పూరము కళిక కూడితే ఏలాగో ఆలాగు** అని శ్రీ శివరామదీక్షితుల వారు దృష్ట ద్రాష్టాంతముతో సెలవిచ్చారు. అగ్నిగురుడు కర్పూరము శిష్యుడు.

ఆ కర్పూరము అగ్నిచేత కాల్చబడి, తదనంతరము అగ్ని యొక్క గుర్తుకాని కర్పూరము యొక్క గుర్తు కాని లేకుండపోవును. అనగా, ఈ రెండింటిలో ఏ గుర్తు కూడా లేకుండాపోతుంది.

అలాగే ఎరుక పరిపూర్ణపరబ్రహ్మ మందు ముమ్మాటికి లేనిదేయగును.

సద్గురు చరణారవిందార్పణమస్తు

**వేదాతీత తీరందాసు ఆంజనేయులు**
**మందిర కోశాధికారి**
**సికింద్రాబాదు**



ఓం
శ్రీ సద్గురువేనమః

# బ్రహ్మము - మంత్రద్వయము

శ్లో॥ మకారం మననం చైవ । త్రకారం త్రాణముచ్యతే ।
మనన త్రాణమిత్య । హుర్మంత్ర । మిత్య భిదీయతే ॥

మకారం = మనస్సు, త్రకారం = ప్రాణము, హుర్మ = దృష్టి

మనస్సు+ప్రాణము+చూపుల నొకటి జేయుటయే మంత్రము ననగా । మనఃప్రాణ దృష్టులను లయపర్చినాపిన స్వస్వరూపక సందర్శనై ఆపై నింకా నిల్చే నేని, బ్రహ్మసాక్షాత్కారుడై లక్ష్యార్థమును గ్రహించును నిదే మంత్రమందలి రహస్యము నిందులకు నెవరికిష్టమైన మంత్రము వారు జపించవచ్చును.

తారక యోగులు తారక మంత్రమే మిన్నయని యాసనాదులు, ముద్రలు, లనగా ధ్యానముద్ర, మంత్రయోగము, లయ యోగము హఠ యోగము మున్నగునవే గాక, భూచరి ఖేచరి మొదలగు ముద్రలు వేసి కాయంబు ననేక కష్టంబులొనర్చురు, మనస్సునే ప్రధానంగా జేసి చిత్తేకాగ్రత నొందింతురే తప్ప ఆపై విషయం గ్రాహ్ మొందక స్వస్వరూప సందర్శనంబొంది యానందింతురు. నిది కేవలం మనస్సు నొంది, నమనస్కభావంబొందును. ఎట్లన

తే॥ తారకంబు మనశ్శుద్ధి కారకంబు ।
సాంఖ్య మాత్మ స్వరూప విచారకంబు ।
అనుభవజ్ఞాన మమనస్కమట్లు గాన ।
నాధ మెఱిగింతు మొదలనీ వవధరింపు । (అవధరింపు=విను)

సీ॥ రా. సం. ప్రథమాశ్వాసము. 90. వ పద్యము)

ఏది ఏమైనప్పటికి రాజయోగులకు మాత్రము 'హంస' మంత్రమే శ్రేయస్కరమని యనుభవజ్ఞులైన నచల గురువు లాన తిచ్చారు. మంత్రములను విచారించగా, నచల సాంప్రదాయులకు (గురుమాలా మంత్రము గురునిష్ఠకు). మంత్ర ద్వయములని పారంపర్యాను గుణంగా నచల గురువు లెల్లరు బోధిస్తున్నారు. ఆ మంత్ర ద్వయము లేవన. 1. మొదటిది ద్వాదశియని 2. రెండవది షోడశియని జెప్పినారు. నిందులో ఓం శబ్దించుట లేదు. ఓంకారము లేనిది మంత్రము కాదని మంత్రశాస్త్రము ఘోషిస్తున్నది. నివి మంత్రము లేట్లాయె? యని గురు ముఖతన విచారించుకోవలయునే గాని, శాస్త్ర వాసనందు మరగి, వితండ వాదన జేసితే ఫలమేమి? శుద్ధ నిర్గుణా. కం॥ ములలో ఆ మంత్ర ద్వయము దెల్పేద . . . యని శ్రీకృష్ణ దేశికేంద్రులు సెలవిచ్చారు గదా ! యట్లే విచారించుకున్నచో తేట తెల్లమగును. షోడశి యనగా 16 గదా ? యట్లే దీనిని బ్రహ్మ పదార్థంగా విచారిస్తాము.

బ్రహ్మము : షోదశి, మూలం.... ఏమి లేదు । ఈ గుర్తే అహంగదా । అహమే బ్రహ్మముగదా । మరి బ్రహ్మమననేమి? అహం పదార్థ రహితః యననేమి ? నిదెట్లు రహితము ? యని విచారించగా !

నేను నేను యనేటటు వంటి వ్యవహార మొకటున్నది గదా। ఈ వ్యవహారము కెవ్వడాధారమొ నతడే ప్రత్యగాత్మ నిది మనోబుద్ధి మొదలగు నింద్రియాల నంటుపెట్టుకొని దేహియై దేహమున కాధారమై యున్నదన్నారు. నిదియే పిండాండమని యన్నారు. నిది కేవలం ప్రాపంచిక వ్యవహారముతో ముడిబడి యున్నదన్నారు. నిట్లనుకుంటే సుషుప్తిలో ప్రపంచ మెక్కడిది? దీని కాత్మకారణమన్నారు. ఆత్మ కారణ మంటే, ఆత్మకు బ్రహ్మ కారణమౌను. నిట్ల యోచించ దీనికి సర్వసాక్షియగు పరబ్రహ్మ కారణమైనట్లే గదా ।మరి బ్రహ్మమెట్లు ? బ్రహ్మ మననేమని విచారించగ ।

**శ్లో ॥ భ్రమేణహం భ్రమేణత్వం । భ్రమేణోపాసకజనః ।**
**భ్రమేణేశ్వర భావత్వం । భ్రమ మూలం మిదం జగత్ ॥**

ఈ బ్రహ్మయే తత్పదం (ఈశ్వరుడు) బ్రహ్మమే త్వం పదమగు జీవుడు. బ్రహ్మమే నహము. నిదే నన్నింటికి జగత్తు కాధారమైనందున నన్నింటికిదే మూలమని మురిసియున్నారు. దీనినే బ్రహ్మమని నిర్వచించారు. ఎట్లన ।

**శ్లో॥ అస్తిభాతి ప్రియం రూపం । నామచ్చేత్యంశ పంచకం ।**
**ఆధ్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం ॥**

నిట్లు వేదాంత పంచ దశిలో నిర్వచింప బడినది. విచారిస్తే అస్తిభాతి ప్రియము లెక్కడ గలవో నక్కడనే బ్రహ్మము భాసిస్తున్నది. తప్ప। మరెక్కడ గాన రాకుండయున్నది. నట్లుగాక శరీరాదులందు ప్రత్యగాత్మ స్వరూపమై జ్ఞానమైనుపాదుల యందు నింద్రియాల నాశ్రయించి స్థాన బేధమార్పులు జెందుచున్నది. మరినీ బ్రహ్మమున కేవలత్వమెట్లు ? యని విచారించాలి. ఆవరణ రూపమై శబ్దస్పర్శ రూప రసగందాదులను సూక్ష్మాతి సూక్ష్మంగ తనలో గర్భీకృతము గావించుకొని యున్నదే గాని వేరుగాదు. నివ్విధంబుగా జ్ఞానాజ్ఞానములుగా ద్వంద్వములై లొకప్పుడెరుకై మరొకప్పుడు మరుపై యున్నదేగాని । ఏకస్థితిలో ఎన్నడు ఏ మాత్రమే లేదు

ఏకస్థితి యనగా సర్వకాల సర్వావస్థల యందున్ను స్థిరత్వము గలిగి యుండి నిశ్చలమై, నిశ్శబ్దమై రాకడ పోకడ లేక, నేమిగాక, యుండాలి. నట్లుగోచరించడము లేదు గదా। కాల మనగా నుదయ కాలము. మధ్యాహ్నకాలము, సంధ్యాకాలములు, రాత్రి కాలములే గాక సృష్టి స్థితి లయాదులందున్ను నిట్టి బ్రహ్మము మార్పు జెందు చునే యున్నది గదా । నిది నేక మెట్లగును? నీబ్రహ్మము నేక రూపమై బీజరూపము దాల్చి తాత్కాలికంగా నచలత్వము గలిగి యుండినదే గాని, శాశ్వితంగా అలాలేదు. సృష్టి యున్నపుడు సృష్టిలేనపుడున్ను బీజరూపమైనదే బ్రహ్మమని తెలిసింది. కాని శంకరాచార్యుల వారు **"బ్రహ్మసత్యము జగన్మిధ్య"** యనగా పరబ్రహ్మము సత్యమని మాయ శబలిత బ్రహ్మము నసత్యమన్నారు. నిది తండ్రిశాశ్వితుడు కుమారుడు నశాశ్వితుడన్నట్లుగా నున్నది. నిది పిండాండమందు జ్ఞానమని వర్ణించినారు. "యమాసాది ఇతి మాయి" లేనిదే మాయ యని "మీయతే యనేన ఇతిమాయ" మిదిలోనికి వచ్చినదే మాయ. ఆవరణతో గూడియున్నదే మాయ. నిట్టి మాయా శబలిత బ్రహ్మమునకు మూలము పరబ్రహ్మమే గదా । నిదినిత్య సత్యవస్తు వెట్లగును?

పరబ్రహ్మమును పరావాక్కుగా వర్ణించారు. నీవాక్కులు (4) నాలుగు విధములు 1. పరా 2.పశ్యంతి 3. మధ్యమ 4. వైఖరి వాక్కులు. ఆదివాక్కు పరావాక్కే గదా । దీనినే నాధబ్రహ్మ మన్నారు. మరిట్లు ధ్వనియున్నపుడు ధ్వని రెండు విధములాయె. 1. ధ్వన్యాత్మకం 2. వర్ణాత్మకం పరావాక్కుగా యున్నపుడు అధిష్ఠాన చేతన బ్రహ్మమన్నారు. వర్ణాత్మకంగా యున్నపుడు "ప్రత్యగాత్మ" గా వర్ణించారు. పరావాక్కు పరబ్రహ్మంగాను. "ప్రత్యగాత్మ" పిండాండంగా జెప్పారు. నైనా నిదిమార్పు జెందుచునేయున్నది. నెట్లన "ఏకంననేకం భవతి సర్వం ఖల్విదంబ్రహ్మ" యని శృతి వాక్యము చెబుతూనే యున్నది. నిటువంటి దానికి "ఎరుక మరుపు" యనే పర్యాయ పదమును వాడినారు. ఎరుకని, నేనని యహమని, సాక్షని, జ్ఞానమని, శబ్దమని, ఆత్మని, బ్రహ్మమని, పరబ్రహ్మమని స్థాన బేధముగా నొకే వస్తువును వర్ణించారు. "ఆకాశో గుణఃశబ్ధతః । నిశ్శబ్దోబ్రహ్మముశ్చ్యతే" తాత్కాలికంగా శబ్దము లేకపోయినంత మాత్రాన పరిపూర్ణమాయెనా ? సృష్టికామన మందు (అఖండ ఎరుక స్వరూపమై) అఖండపు టెరుకై, తదుపరి శుద్ధపు టేరుక, మలినపుటేరుక, మిశ్రపుటేరుకైనదేగదా।

పరిపూర్ణమెట్లాయే? నావరణ మున్నపుడు నచలమెట్లాయే; శృతి ॥ అశరీరం సర్వదాస్తి । శరీర రహితం సదా । అయమేవ సద్యోముక్తి । రన్యదా(భ్రమ కారణం॥ యన్నట్లు గాన వచ్చుట లేదు. మరి శాశ్వితమెట్లాయే? అధ్యారోపహరంగా విచారించగా "రజ్జుసర్ప(భ్రాంతివత్" యన్నారు. నొకటుంటె నింకొకటిగా భ్రమించడము. నీ భ్రాంతి నెట్లనా నీ రెంటి వస్తువుల యందు నోకె పోలిక యుండడము వల్లనే భ్రాంతిగల్గింది. పాము సన్నగా పొడుగ్గా నుండ బట్టే భ్రమదోచే గాని । స్వరూప కాధారంగా భ్రమదోచేగాని, స్వలక్షణమందు నంతకంత తేడాయే. స్వరూపకంగా ఆరోపించబడినదే గాని సత్యముగాదు. పామున్ను వంకర టింకరగా సన్నగా పొడవుగ నుండే త్రాడున్ననట్లే గోచరించే గాన ! రజ్జుశార్దూల వత్ యనలేదుగదా । స్వరూప బేధమున్నందున పాము పాముగాను, త్రాడు త్రాడుగాను నిర్ధారించబడినది. నిదెట్లన మరుపనే మాయ వల్లే గాని నింకేట్లునుగాదు ।

కం॥ మాయా ప్రతిబింబంబును ।మాయాదిష్ఠాన పరము మాయయుగూడన్ ।
మాయావియైన యీశుడ । మాయికుడగు నతడు బ్రహ్మమయుడై యుంటన్ ॥
(సీ.రా.సం॥ద్వితీయ శాశ్వము 30 పేజి 262 పద్యం)

మాయకు యధిష్ఠానుదు మాయను ప్రేరేపించు వాడును. ఈశ్వరుడైనపుడు ననగా బింబప్రతిబింబంబులును నీశ్వరుడే గావున నితడే బ్రహ్మ స్వరూపుడైనాడని పద్యభావము, గాని నిట్టి బ్రహ్మమే మూలప్రకృతి యైనపుడునది మూలమాయయే యగును. గాన బ్రహ్మమెట్లు సత్యమగును. నిచట భ్రమించినది బ్రహ్మమా? లేక జీవుడా ? యని విచారించిన ప్రశ్నలనేకం తలెత్తును. గాని నివురుంటేనే గదా నిప్పు (ఆత్మ+జీవుడు) నిది యున్నదున్నట్లు విచారించవచ్చు. నిట్టి బ్రహ్మకున్ను ఆత్మ, జీవ, ప్రణవాలకు భాష్యకారులు పాదములుగా వివరించారు. నవి. బ్రహ్మపాదములు 4. 1. అవిద్యాపాదము, 2. విద్యాపాదము, 3. ఆనందపాదము, 4. తురీయపాదం. ఆత్మపాదములు 4. 1. విరాట్, 2, హిరణ్య, 3. అవ్యాకృత 4. పరమాత్మ, జీవపాదములు 4. 1. విశ్వ, 2. తైజస, 3. ప్రాజ్ఞ, 4. ప్రత్యగాత్మగా జెప్పబడెను. ప్రణవ పాదములు 4. 1. అకార, 2. ఉకార, 3. మకార, 4. అర్ధమాత్రుక. ఈ విధంగా 4×4=16 పాదములాయెనిదే షోడశి, నిదే గుర్తు నిట్టి షోడశిని విచారించి గుర్తు నెగురగొట్టిన వాడే గురుపుత్రుడు. నేను లేకుంటే అంత పరిపూర్ణమే . నిదే పూర్ణము. పరిపూర్ణము సంపూర్ణముగా విచారించాలి. నిది కేవలం పుస్తకం చదివి మస్తకంతో నాలోచించిన నంతుబట్టదు. గురు శిష్య న్యాయంగా గురుకృపకు పాత్రులై గురుముఖ తన విచారించిన సరిపడును. అన్యదా నిది నంతుబట్టదు. నిది ఎటువంటి దనగా । కం॥ నిరుపాధిక మగు బయలున । మరి లేకనే కలిగినట్టి మారుతమునకే పరియాయ నామములగు । కరువలియన ఎరుక యనిన కదుమాయనన్ ॥ ఇసువంటి దానిని విచారించవలెననిన. గురువేగావలయును గాని, మరెట్లు బోధబడదు.

ఆ॥ వే ॥ గురుని శిక్షణ లేక గుర్తెట్లు దొలుగును । యుజనికైన వాని యబ్బకైన ।
తాళపుచేవి లేక తలుపు లెట్టులూడు । విశ్వదాభిరామ । వినురావేమ ॥

నట్లే ద్వాదశిని విచారించగా । శ్లో॥ పూర్వవేవ నిరాళంబం । ఆగ్నేయం నిర్గుణం తథా.......... అచలోయం సనాతన ॥

**శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణం......సద్గురుం తం నమామి ॥**

కొందరు పరిపూర్ణ భావజ్ఞులు పై శ్లోకములను పరిపూర్ణమని భావించి బోధిస్తున్నారు । అదైతే ద్వాదశి ఏది? విచారిస్తే నిదే ద్వాదాశి యని నిర్ణయము. ద్వాదశి -పరిపూర్ణము - వేరు వేరా ? మరి ద్వాదశిని మంత్రంగా దీక్షితీయంలో వివరించినారు. శ్రీకృష్ణదేశిక కేంద్రుల వారు కం॥ ఆ మంత్ర యుగము దెల్పెద..... ॥ యని వివరించారు. మరిపూర్ణము. మంత్రాలకబ్బిన ?

**శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం । పూర్ణాత్పూర్ణ ముదుశ్చతే ।**
**పూర్ణశ్య పూర్ణ మాదాయ । పూర్ణమేవ వశిష్యతే ॥**

పూర్ణము గ్రహించిన వస్తువు నుండి పూర్ణవస్తువును తొలగించిన పరిపూర్ణమే యున్నది. 1. పరిపూర్ణము 2. లేనెరుక 3. ఎరుకను విడచుట. నిది బృహద్వాశిష్ఠ మందలి 3. ముక్కలు.

గురువు నాశ్రయించిన శిష్యునకు మొదట యమనియమాసనాదులతో పాటు సాంఖ్య, తారక, ఆసన, ముద్రలు, ఆత్మ సాక్ష్యాత్కారము, అమనస్కము, మహావాక్య విచారణ, వార్తికాదుల నెరిగించి, బోధధృఢ పర్చి ద్వాదశిని గూర్చి దెలియపర్చును. నిది గ్రహించిన శిష్యుడైతేనే లెనెరుకను నెరుకతో గురుకృప వల్ల నెగురజిమ్మును. శిష్యుడు (అఖండ ఎరుకను వస్తు నిశ్చయంగా గ్రహించి) అఖండానుభవము పొంది, అఖండానుభవరహిత మొందును గాని నన్యులుగాలేరు. సూచన జేయగానే కనుకునే వానికి సూచన జేయుమన్నాడు. నెట్లన సూచన మరుక్షణమే నిచట గురుశిష్య లిరువురు లేని స్థితే నాపై నంత నచల పరిపూర్ణమే నిదియును గురుమూర్తి ద్వార దెలియవలెను.

పరిపూర్ణమెట్లన ! పరమశివుడు మొదలుకొని పరంపరానుగుణ్యంగా వచ్చిన పరిపూర్ణభావము నితరనాత్మ బోధలచే మిశ్రితమై యున్నందున నందరు నెరుగక కొందరెరిగిరి. నట్టి వారిలో శ్రీ శ్రీధర స్వామి ప్రియశిష్యులు శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులు సౌజ్ఞచే గ్రహించి దీనిని బహిర్గత పర్చి, తెలుగు వారికి తేట తెల్లముగా పరిపూర్ణ భావమందేటట్లు, "దీక్షితీయము" అనుగ్రంధ రాజమును తెలుగులోరచించి కందించనేటికది తస్సాంప్రదాయులందరికి నొకమూల గ్రంథమైనది. దీనిలో వారు విశదపర్చినదేమనగా ! పరిపూర్ణా చలము; రాకడ - పోకడ లేనిది పుట్టుచావులు లేనిది. సకల కాల సకలవస్తువులందు తుది మొదలులేక చలించక నొక్క రీతిగ సృష్టికి పూర్వమే యుండి, కరచరణాదియవ యవములు లేక కేవల అమలనిర్గుణా తీత నిప్రృతి యోగిక యచల పరిపూర్ణయే యుండెను. యణు మధ్యమహాత్పరి ణామమై బ్రహ్మాండ । విశ్వాండ । పిండాండ । జీవేశ్వరు జగత్తుల కాలవాలముగాక, సృష్టికంటే పూర్వమే నేకమై నిత్యమై నాద్యాంత రహితమై జనన మరణాదులు లేక, నావరణరహితమై, సర్వత్రా ముల్లు గ్రుచ్చు సందులేకుండ నిండి నిబిడీకృతమైయున్నదే అచల పరిపూర్ణము.

ఆ॥వె॥ అచల తత్త్వమనగ యనుభవ గమ్యంబు । చూచిచెప్పగ రాదు సూక్ష్మమదియె ।
మనసు దోచదు దాని మర్మ మరయగరాదు ।విశ్వదాభిరామ । వినురవేమ ॥

యని వేమనార్యులు సెలవిచ్చారు.

ఇటువంటి దాని యందు ఏ కారణము లేకుండ తనంతట తానుగా అవ్యక్తమను మాయోపాధి వినుర్ముక్త శుద్ధ చైతన్య త్రిశిక్యాత్మక సంవిద్రూప జ్యోతిర్మయ, శబ్ద, నిశ్శబ్ద, మను స్వయం ప్రకాశ బ్రహ్మమను మహాకాశము తోచెను. ఇదే గుర్తు. నిదే ఎరుక నిదియే షోడశి నది లెనిదే ద్వాదశి, నివి రెండు లేనిదే పరిపూర్ణము. శ్రీ భా॥ కృ॥ 225వ. కం॥ ఇది దప్పు.... నిశ్చయమురా ॥ శ్రీమత్ ఫీల్ఖాణ లక్ష్మణ ప్రభు ద్వయ మంత్రంబుల జోలిచోడ్ రే..... యని విషదపర్చారు. నిది లక్ష్యలక్ష్యార్థముల కవలి భావము నతీతమైనది. గురుకీలు దెలిసేనేని అఖండానుభవ రహితయై ద్వంద్వంబులు బోయి గురుశిష్యులోకటై గుర్తు లేకుండ బోవుదురు. ఆపై నంతా పరిపూర్ణమే.

కం॥ తానే ననకు నిండిన ............... దాన్నెట్లెరుగెదవీవు ॥

1. అభావం శివం అశివంనలిప్యతే 2. అయంవ్యర్థ భాహ్యా కోపీన భవతీ 3. ఏతన్మిధ్యా శుద్ధవియత్కించిన్నాస్తి 4. ఈ వృత్తబట్ట బయలు ఏమి లేదు. నిట్లు ద్వాదశి నాలుగు విధములు.

1. నమూలం అయం మిధ్య నశివం శూన్యైనకిమస్తి ।
2. నిర్మూల మేతధా జ్ఞానశ్చరీరం నాస్తి కేవలం ।
3. మూలభావోమిదం జ్ఞాతుంన శరీరం నకిమస్తి ।
4. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమిలేదు ।

**లోబయలు, వెలిబయలు, ఘటభిన్నం నిర్భయలు**

నిట్లు షోడశి 4 విధములు, ద్వాదశి 4 విధములు, స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ పద్ధతిలో గురుముఖ తన విచారించినవాడే పరిపూర్ణుడగును నన్యదాభ్రమకారణములే.

సదాసద్గురు సేవలో
**సద్గురు చరణధూళి**
**నిర్గుణానంద కోడి అమృతరావు**
**గ్రా॥ ఖాజీపూర్ మం॥ మిరుదొడ్డి, జి॥ మెదక్ ॥**
**మందిరము సహాయ కార్యదర్శి.**

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

గురునికంటెధిక మేదిరా । జీవాత్మా వినరా గురుని కంటె నధిక మేదిరా ॥ ప ॥

పరమపద మార్గమును జూపి జనన మరణాములను బాపి।గురుతు నెగరా జిమ్మీవేశి కరుణతోడ దరిజేర్చేను ॥1॥

కార్య కారణములూ లేక కర్తయన్నాదూను గాక । ఘోరమైనా నరకాములనూ బారదోలీ కడతేర్చేటి ॥ 2 ॥

నిక్కమూగ గురువాక్యాము చక్కగా వినుమానినవల । మక్కువల తెగనరికీ వేశి చిక్కులా బెట్టాక బ్రోచె ॥ 3 ॥

రూపనామామూలు లేక ప్రావుదాపైయున్నా పరము । చూపునూ సౌజ్ఞాచె వేగ తేపతే పాకు నీబయలు ॥ 4 ॥

సాధనా రహితామైనట్టీ ద్వాదశీ షోడశీ గనుమని । బోధ పరచీ పదహారిటినీ పాదుపెకలించీ వేశేను ॥ 5 ॥

భాగవతులా శ్రీ కృష్ణుడు వేగ లక్ష్మణ రమ్మాని । జాగుశాయాక నచలామూ బాగుగా వినజేశీ నేలీన ॥ 6 ॥

## తత్వం

మమును ధరియించెన్॥ ప ॥ సారరహితమగు నచల భావమును సాకల్యముగా వినుపించెన్ ।
గారవించకను యరుకను బట్టియు ధీరుడయ్యి పొమ్మని ద్రుంచెన్ ॥ భార ॥ 1 ॥
క్షర మక్షరముల కవ్వల నుండే పరమ పదంబును జూపించెన్ ।
హరిని గన్న కరి మ్రగ్గిన యట్టని ఆనందముతో నెరిగించెన్ ॥భార॥2॥
బయలులోన యీ జగము లున్నవనె భ్రాంతి నొదలుమని శాశించెన్ ।
జయము గల్గునిక జన్మము లేదని నయ గుణశాలియు నాటించెన్ ॥ భార ॥ 3 ॥
ద్వాదశి మంత్రము మరువ బోకనుచు దయ తోడను నా కెరిగించెన్ ।
మోదముతో షోడశి లేనిది యని వాద భేదముల నొదలించెన్ ॥ భార ॥ 4 ॥
భాగవతుల శ్రీకృష్ణ యోగియును బాగుగ రమ్మని తాబిలచెన్ ।
వేగమె లక్ష్మణదాస గనుమని జాగు శాయకను బోధించెన్ ॥ భార ॥ 5 ॥

# गुरु कैन है ?

**श्लोक :** गुरुर ब्रह्मा गुरुर वष्णिु गुरु देवो महेश्वराः ।।
गुरु साक्षात परमब्रह्मा तस्मै श्री गुरुवे नमः ।।

यह श्लोक हम सब पढतेहै और जानते भी है । परन्तु गुरु आरिवर क्या होता है । यह हर आदमी जानना जरूरी है । ऊपर लिखा गया जो श्लोक को एक बार विचार करने से पता चलता है । कि ब्रह्मा का स्वरुप विष्णु का स्वरुप और ईश्वर का स्वरुप, केवल गुरु मूर्ति है । आखिर असली गुरु कैन है ?

मात्रु देवो भवा पित्रु देवो भवा आचार्या देवो भवा

इसे आर्योत्कि कहते है । इसे आर्योत्की के अनुसार एक बार विचार करने से यह अर्थ समझ मे आता है कि प्रथम गुरु माता और पिता है । दूसरा गुरु जो है । विध्धा गुरु जी है । लेकीन शास्त्र के अनूसार आठ प्रकार के गुरु होते है । वे है।

**१) सूचक गुरु　२) वाचक गुरु　३) बोध गुरु　४) काम्या गुरु**
**५) निशिध्द गुरु　६) विहित गुरु　७) कारण गुरु　८) परम गुरु**

**१) सूचक गुरु :** इस प्रथ्वी या संसार मे जीने के लिए कई विध्याँ ये है । यानि लोक कल्याण को करने के लिए विज्ञान शास्त्र एवम चिकित्सा शास्त्र जो भी है हमे गुरु से सीखने वे ही सूचक गुरु कहलाते है ।

**२) वाचक गुरु :** वर्ण आश्रम, धर्म, अधर्म और धार्मिकता के बारे में जो सिखाते है वही है वाचक गुरु।

**३) बोधक गुरु :** मंत्र तंत्र जैसे पंचाक्षरी अष्टाक्षरी और अपने धम्र के बारे जो सिखाते है वही ही बोधक गुरु ।

**४) काम्या गुरु :** पुण्य कर्म करने के लिए उपदेश देकर परलोक सुख प्राप्त कराने वाले को काम्या गुरु कहते है ।

**५) निशिध्द गुरु :** मारण, मोहान, स्तंभन, उच्चाटना, वशीकरण आदि क्षुद्र विधा सिखा कर लोक कल्याण को भंग करने वाले को निशिध्द गुरु कहते है ।

**६) विहीत गुरु :** ये प्रवचन देते है कि इस जग मे जो सुख मिलता है वह केवल चंद दिनों का है । हमेशा हमेशा के लिए नही है । केवल परलोक सुख पाने से हमेशा सुख मिलता है । यह प्रवचन विहीत गुरु को सुचित करते है ।

**७) कारण गुरु :** नामा रुपात्मक कार्य रुपात्मक कारण वस्तु स्वरुप का ज्ञान प्रात्प कराते है । उसे कारण गुरु करते है ।

**८) परम गुरु :** यह गुरु सबसे बडे और उचित गुरु है । क्यो कि इस ने यह बतलाते है कि आत्मा और परमात्मा क्या है । दोनों में अंतर क्या है । एक मामूली इंसान और भगवान क्या चीज

होते है यह सारा अंतर बतलाते है। भगवान और भक्त को अनुसंधान करते है।
यानि परमात्मा से आत्मा को मिलाते है। इसलिए इन्हे परम गुरु कहते है।

इस प्रकार (८) आठ गुरु ओं में ये सबसे बडे गुरु माना जाता है। केवल एक ही निशिध्द गुरु बिना सारे गुरुलोक कल्याण के लिए उपयोगी है। गुरु गीता में पार्वती परमेस्वर से पूछती है। हे ईस्वर जी गुरु का क्या है। गुरु शब्द का अर्थ क्या है। कृपा कर के मुझे बतायें। तब ईस्वर ने कहा हे पार्वती मन लगाकर ध्यान से सुनो।

**श्लोक :** १) न गुरो रधिकम तत्वम। न गुरो रधिकम तपा :।
न गुरो रधिकम ज्ञानम। तस्मै श्री गुरुवे नमः ॥

**श्लोकः** २) अज्ञान तिमिरान्धस्य ज्ञानाजन शलाकया। चक्षुरुनमीलित येन तस्मै श्री गुरुवे नमः ॥

**तात्पर्य :** घोर अज्ञान अंधकार को निकाल कर। मुझे ज्ञान का प्रकाश दिया जाता है।

सारांश यह है कि, गुरु बिना ज्ञान, तपस्या और तत्व नहि है। यही बात कबिर दास ने बताई कि गुरु बिन ज्ञान, नहि। इसलिए गुरु चरणों को प्रणाम करना है। हे, पार्वती कलियुग में आठ प्रकार के गुरुओं मे केवल ब्रह्मा ज्ञान जो देते है। वहि सही गुरु है।

## गुरु का अर्थ यह है कि

**श्लोक :** १) गुकारंच गुनातीतो। रुपानीतो रुकारकः।
गुणरुप विहीं नत्व। तस्म श्री गुरु वे नमः ॥

**अर्थात :** गु - गुणरहित, यानी र्गुणों को छोडकर अखंड स्वरुप पाने वाला।

**रु :** रुपों कोअनीन यानी जो रुप देखते है वही रुप मे आनन्द य दुःख पाते है।
इन रुपों का छोड। ने वाला।

**तस्मै :** जैसे. गुरुओं को यानी गुण रुप रहीत गुरुजी को प्रणाम करना है।

**श्लोक :** १) अखंडमंडलाकारम। व्यात्पम येना चराचरम।
ततपदम दर्शितम येना। तस्मै श्री गुरुवे नमः ॥
२) तस्मै कारण रुपयाँ। कार्य रुपेना भतियत।
काय्र कारण रुपया। तस्मै श्री गुरुवे नमः ॥

इसी प्रकार गुरु जी को प्रणाम करना है। लेकिन दुनिया मे कई आदमीगुरु का रुप धारण करके सज्जनों को कष्ट पहुँचा रहे हैं। इन गुरुओं को अपनाना उचित नहीं है। सारी चीज खोजकर के सहि गुरु को अपनाना है. क्यों कि गुरु बिना ज्ञान नहीं और पुनर्जनम बन्द नही होता है।

**सर्वम सदगुरु चरणाप्रन मस्तु**

**॥ ॐ शान्ति : शान्ति : शान्ति : ॥**

**निर्गणानंद कोडि अमृतराव**
**हैदराबाद**

శ్రీ సద్గురుభ్యోనమః

# గురుసేవయే పుణ్య స్థలము

నిశ్చలానంద మాలెపురాజమల్లయాచారి
లోలం - మం. : దిలావర్‌పూర్,
జిల్లా ఆదిలాబాదు - 504306

సీ॥ భూమ సిద్ధాంతాచల బోధ సాహిత్యమే నాకు జీవగఱ్ఱ
పూర్ణ సిద్ధాంతాచల బోధ భూములే నాకు విహారభూములు
పరీ పూర్ణాచల పరభావమే నా నిజ నివాసస్థానము
ఉండి లేనిదైన ఈ జీవభూమి నాకు స్వప్న దేహము
మూలము లేక మనుగడ సాగించుచున్న ఈ ఎఱుక
అస్థిర దేహమే ప్రస్తుత నివాస స్థానము ఎఱుక మరుపుల కతీతుడనై నేను
మేనులు సదా లేవని గుర్తెరింగి గుర్తులేని వానినై జీవన యానము
నిత్యము నిజజీవితమును గడుపుచున్నాను. పెద్దల సేవను కోరుకొనుచున్నాను.

1. చెప్పినది విని విచారించి ఆచరించువాడు జ్ఞాని.
2. తనకు తెలిసినది ఇతరులకు దాచక తెలియ జేయువాడు తెలివిపరుడు.
3. తనకు తెలిసిన, తెలియకున్న వాదించువారు (తర్కించువారు) మూర్ఖులు. వాదం - బేధం

**వివరణ**

అచలఋషి సిద్ధాంతము, పరిపూర్ణ బోధకు సంబంధించిన గ్రంథములు చదువుట విననేర్పు గలుగుట, గ్రహించుట, విచారించుట సత్సంఘములు చేయుట, గురువును గురువాక్యములను మరువకుండుట, సద్గురువులకు నాలుగు విధముల (అంగ, స్థాన, ఆత్మ సద్భావన) సేవ, శక్తి వంచన లేకుండ చేయుట, నాకు నిత్యనిజజీవితము గడుపుట.

ఎక్కడెక్కడ అచల సద్గురువులు ఉందురో అక్కడికి వెళ్ళుట, పీఠములు, ఉపపీఠములు, మందిరములు, ఆశ్రమములు, చేరి గురువాక్యమునకు సంబంధించిన గట్టి మాటలను నమ్మి చేటవలె గట్టి విత్తులను తనలో వేసుకొనిపొల్లును చిమ్మి వేయునట్లు ఈ దృష్టాంతము ఆధారముగా తిరుగవలసిన స్థలములు నా తీర్థయాత్రలు, పుణ్య స్థలములు.

పరిపూర్ణం ఉన్నదని, ఎఱుక లేదని గురుబోధచే ఎరిగి ద్వాదశి తనలో దృఢపరుచుకొని రెండింటి జోలికి పోక ఉన్నది లేదని, లేనిదే ఉన్నదని నమ్ముట నా నిజస్థానము, నివాసస్థానము. అదియే అని తనయందు విశ్వాసము కలిగియుండుట.

నేను లేనెరుకను। మూలము లేదని ఈ గుర్తెరిగే శరీరము నశ్వరము అని తెలిసి ఉండి లేనట్లు "ఈ శరీరయాత్ర సురస్వప్నము" వంటిదని స్థిత ప్రజ్ఞుడనై శీతోష్ణములకు ఓర్చి ద్వంద్వములకు అతీతుడనై ఉందును. "స్వప్నము సత్యము కాదు" ఎట్లనగా స్వప్నములో వచ్చిన వారిని ఫోటో తీయరాదు. మరియు వారి మాటలను టేపు రికార్డు చేయరాదు. కల సత్యము కాదు. కలగన్నవాడు, కలలో వచ్చినవారు అనిత్యులే! నిద్రించు గదిలో ఎవ్వరు లేకుండిరి. మేల్కొంటె ఎవ్వరు లేరు. అశ్వములు, ఏనుగులు, వాహనములు వాటిపై అధిరోహించిన వారు కూడా లేరు. ఎట్టి గుర్తులు లేవు. ఎట్లా నమ్మేది. వాళ్ళందరు కలలో ఎక్కడి నుండి వచ్చిరో ఎక్కడికి వెళ్ళిరో మూలము స్థానము తెలియదు. అట్లే "మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమిలేదు".

నేను మేనులు అశాశ్వితమని తెలిసి ప్రస్తుతము ఎఱుకచే జీవించుచున్నాను. పుట్టినానని భ్రమచే జీవించి చస్తాననే భయముతో అజ్ఞాన అందకారములో క్షణం క్షణం జననం, క్షణం క్షణం మరణం "సోహం సో" రహితము చేయు సద్గురువుల చేరి భక్తి శ్రద్ధలతో బోధ గ్రహించిన జన్మరహితము కాగలదని ప్రార్థన. జనన మరణ ప్రవాహామును దాటించు అచల సద్గురువులే అర్హులను నూటికి కోటికి ఒక్కటే మాట. మీ పాదరేణువు.

సద్గురు చరణం। భవభయహరణం। భవ భయ హరణం। సద్గురు చరణం।

"భోలో శ్రీ సద్గురు ప్రభు మహారాజ్‌కీ జై"

## శ్రీ గురుభ్యోనమః

శ్రీమత్ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోరారహులు

**శ్రీమద్భాగవత కృష్ణదేశికేంద్ర ప్రభువులవారి ప్రియశిష్య రత్నంబగు శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణప్రభుదేశికేంద్రుల వారి శతవార్షికారాధన మహోత్సవము సందర్భమున పంచ రత్నములు సమర్పణ.**

1.సీ॥ వసుధలో ఫీల్ఖాన । వంశాబ్ధి చంద్రుండు లక్ష్మణయుతుండు । లక్ష్మణార్య ।
హైదరాబాదులో । నందు బేగంపేట పురమందున నీవు । పూజ్యతముగ ।
పుట్టినాడవు నీవు । పుణ్యాత్మచారిత్ర ప్రహ్లాదుని వలెను । బరగినావు ।
తల్లిదండ్రుల యందు । తరగని ప్రేమతో భక్తితో నుంటివి । భద్రముగను ।
అవని జనులుతోడ । ఆనందముగ నుండి । సహజరీతియుగాను । జగమునందు ।

తే ॥ శాంతి చిత్తము గలిగుండి । సశ్శిష్యులుతొ । శతవార్షిక పూజలు । జరుపుకున్న ।
జన్మయనిన నీ జన్మె సం। పూర్ణజన్మ । నిన్ను సామాన్య మానవుల్ । నెరుగలేరు ।
అచల భావాజ్ఞ లక్ష్మణా । ఆర్యవర్య ॥

2.సీ॥ పిన్న వయసు నందె । చిదలింప పరమాత్మ । అవతార శ్రీ విష్ణు । హరుని యందు
సర్వదేవతల యందు । సద్భక్తి గలిగియు దివ్య క్షేత్రములెన్నొ । తిరిగినావు
సాధన సంపత్తి । సారాంశ మెరిగియు మోక్ష జిజ్ఞాసతొ । దీక్షగలిగి ।
అష్టాంగ యోగముల్ । నభ్యశించుయు నీవు । జీవశివైక్యమున్ । చెందినావు ।
లీనమైన యెరుక । తిరిగి పుట్టుననుచు । అచల భావంబు దర్శించునావు ।

తే॥ పరమ ధర్మము పరబాహ్య । బ్రహ్మమందు । యెరుక పుట్టలేదని తెల్సి । విడచినావు ।
భ్రాంతియే లేదు పరతత్వ । భావమీవు । ప్రజ్ఞ రాహిత్య । లక్ష్మణ ప్రభువరుండ ॥

3.సీ॥ శుద్ధ నిర్గుణ తత్త్వ । కందార్థ రచియిత । కారణ జన్ముని । శరణజొచ్చి
భాగవత కృష్ణ । ప్రభుదేశికేంద్రుని । పాదముల్ పూజించు । మాన్యుడితడు ।
పరమ పావనమైన । పరిపూర్ణ బ్రహ్మము । భ్రాంతికి స్తానంబు । ప్రజ్ఞ యెరుక ।
యీ రెండి మర్మము । నిశ్చయముగ నెర్గి । లేనిది యెరుకని । లెస్సగాను

తే॥ విడుపు గల్గిన నిజగురు । దేవుడితడు । మాయ ప్రకృతి కంటినె । ప్రభువరుండు ।
శిష్యగణమును పాలింప । శ్రేష్ఠుడితడు సాక్షితీతుండు లక్ష్మణా । చార్య । గురుడు ॥

4.సీ॥ శ్రీ బృహద్వాశిష్ట । సిద్ధాంత గ్రంథంబు । సారాంశ మెరిగిన । సాధురూప ।
చిత్తమందు గురుని । స్తిరముగ నిల్పియు । అచల గ్రంథములెన్నొ । రచన జేసి ।
వర వేంకటేశ్వర । నార్యుల్కు బోధించి । కొండోజు సీతయా । కోర్కెమీర ।
అచల బోధను దెల్పి । అహము పదార్ధంబు । రహితంబు జేసిన । మోహరహిత ।
హైదరా సికిందరా । బాదులో శిష్యుల । పరితాపమును దీర్చు పండితార్య ।

తే॥ దేశదేశల్లో మీ కీర్తి । దివ్యముగను । వ్యాప్తి చెందిన పరమేశ । భవుడవయ్యా ।
అచల పీఠం బధిష్ఠించు । అమరవంద్య । లక్ష్యతీతుండ సద్గురు లక్ష్మణార్య ॥

5.తే॥ నడుపు చుండిరి ధరలోన । నాణ్యముగను వ్రాసి నాడను గురుమూర్తి । భాసురముగ
పంచరత్నముల్ నర్పిస్తి భ్రాంతిరహిత బయలులో బట్టబయలైన పరమపురుష ।
వందనముల్ సదా మీకు । వసుధ యందు సత్యదీక్షితా లక్ష్మణా।చార్య । వర్య ॥

ఇట్లు

బుధవిధేయుడు

**అచల విద్యావిశారద కంబాల గురుమూర్తి బోధానందరాజయోగి -**

**గరివిడి, విజయనగరం జిల్లా ఫోన్ : 9618751233**

ఓం
శ్రీ సద్గురువేనమః

# శ్రీమదచల పూర్ణబోధ శిఖామణి మరియు పరిపూర్ణబోధ సిద్ధాన్త శిరోమణి

నుండి కొన్ని ముఖ్యమైనవి తెలుపుచున్నాము.
అచల గురు శ్రీ పండితారాధ్య పండిత శివానందస్వామి వారు వ్రాసిన గ్రంథము

1. బాహ్యా భ్యంతరముల యందు వున్న పరిపూర్ణ బ్రహ్మమును చూపించి తనను లేకుండా చేసినవాడే సద్గురువు. ఏ కులము వాడయినా వాడే పరశివ స్వరూపుడు, యిదే నిశ్చయము, అన్యులు అచలగురువులు గారు. ఈ సాంప్రదాయము దొరికేది కష్టము. భ్రాంతి లేని మార్గము యిదే. ఇతరములన్నియు భ్రాంతికి మూలము. సర్వకాలము తనను లేకుండా చేసిన వాడే గురువు. ఇదే సత్యము, యిదే స్వతస్సిద్ధము, యిదే అనుభవ నిరసనమును, రెండవ ప్రకరణం బుద్ధిమంతులైన వానికి చాలు. విస్తారము యేమి పని? తాను తాననే భ్రమ విడచి చూడక చూస్తే అంతా అచలమే. అంతా బ్రహ్మమే రెండవది యేదీకాదు.
2. సద్గురూప దేశము లేకపోతే గురుతు రహితము కాదు. చలించని వస్తువును చూపించునది గనుకనే అచలబోధ.
3. పరిపూర్ణము శూన్యము గాదు. ప్రపంచములో కానరానటువంటి వస్తువు శూన్యముగాని ప్రత్యక్షముగా సర్వమందున నిండి నిబిఢీ కృతమైయున్న పరిపూర్ణము శూన్యము యేలాగు ?
4. ఈ పరము సర్వదా నామరూప రహితమై అవాఙ్మానస గోచరమై అశ్రుతర్క్యమై యేమియు కాక యేమియు లేక అంతా అదే స్వతస్సిద్ధమై యున్నది.
5. చాయ లేనిదే గురుస్వరూపము, పరిపూర్ణము గనుక చాయలేదు. పరిపూర్ణమే స్వతస్సిద్ధమై కాలభేద, వస్తుభేద, రూపభేద రహితమై గురువాక్యము చేత గుర్తుపోయెనా స్వతస్సిద్ధమై వున్నదే వున్నది.
6. సర్వము అయి సర్వము కాదు కనుక అదే మాయ. మాయ అంటే లేనిది. మాయ అనగా నెటువంటిది అంటే మెరుపు బుద్బుదముల వంటిది. అప్పుడే కానవచ్చి అప్పుడు పొయ్యేది గనుక మాయ ఆయెను.
7. ఉన్నది మూడు కాలముల యందును వున్నది. అన్నది మూడుకాలముల యందు లేకపోయెను. గనుక వున్నది పూర్ణమా? శూన్యమా? రెండు కాదా? అంటే విచారించనప్పుడు శూన్యము. విచారించినప్పుడు పూర్ణము. తాను లేనప్పుడు ఈ రెండును లేవు గనుక ఏమీ అనరాదు. మూడు కాలముల యందును మూడవస్థల యందును విన్నను, కన్నను, తిన్నను, అన్నప్పుడు లేదు. విన్నప్పుడు లేదు, కన్నప్పుడు లేదు. ఎప్పుడు పుట్టనేలేదు. ముందు పుట్టపోదు. వెనుక పుట్టలేదు. లేనిది గనక ఎన్నడు లేదు. ఉన్నదంటే గురు పుత్రుడు కాడు. చందన కుసుమవత్. ఇదే సిద్ధాంతము.
8. జ్ఞానాజ్ఞాన నిరసనమే పరిపూర్ణబోధ. చలించని వస్తువును చూపించునది గనుకనే అచలబోధ. ఇది వేద వేదాంతాతీతము. పరమ రహస్యము.

9. యేమీ లేదు అని అన్నది లేదు. కోటిమాటలకైనా యిదే జ్ఞాపకము, యిదే వాస్తవము. నిన్ను విడచి చూస్తే నిశ్చయము. ఇది గురు కటాక్షము వలన తెలిసికొని తాను లేకుండా పోవలెను. ఇది తెలిసితే అంతా అచలమే. మేమనుటకు యేమీ లేదు. ఇంకా యేమి చెప్పినను అది అంతాసోది పనికిరాదు.

10. తాననే తెరను గురుకృపచేత తీసి లేక చూస్తే అంతా పరిపూర్ణమే నీకు సహనము వున్న యెడల యీ మార్గమును అవలంబించుము. లేని యెడల అవసరము లేదు.

11. మూలము లేదు గనుక తాను యెప్పుడూ లేదు. గుర్తెరిగే చైతన్యమే మాయ అంతా దాని సత్తా చేతనే ప్రకాశిస్తు వున్నది. దీనిని పోగొట్టితే అంతా అదే. అణువుకు అణువు, మహత్తుకు మహత్తై వున్నది.

12. దేహమనగా గుర్తెరిగేది. అది మూలము లేనిది.

13. ఎరుక వంటి వస్తువు రెండోది లేదు. పరిపూర్ణము వంటిది, రెండోవస్తువ లేదు. ఎరుక చేత సమస్తము యెరిగి ఎరుకను విడిస్తేసరి.

14. ఏమీ లేదు, ఏమీలేదు, బయలు, బయలు అన్నా ఆమార్గము తెలిసిన వాడు కాదు. లోనులోతారము, బయట బతారము అమ్మెది వకటి అశమి సంచిలోది వకటి, అన్నట్టు వున్నవారికి యీ మార్గము తెలియదు.

15. సూచన చేత సూక్ష్మముగా గ్రహించవలెను. నిత్యము ధృఢాభ్యాసము చేస్తు వుంటే కుదురును. గురువాక్యము ప్రాప్తము లేకుంటే ధృఢము కావడము కష్టము. ఇది పట్టులేని పరిపూర్ణ బోధ గనుక పొందడము కఠినము. యెరుక యున్నవాడు, లేనివాడు సమము కాదు. కంటికి రెప్ప యేవిధముగా కాపాడునో, ఆ ప్రకారము బోధ కాపాడుకోవలెను. ఈ బోధానంతరము యే భ్రాంతులు పుట్టవు.

16. **శ్లో॥ అంతఃశూన్యం బహిఃశూన్యం సర్వశూన్యం సదా శివం ।**
**శూన్యా శూన్యః విరాహిత్యం తల్లింతం అచలం ప్రభుః ॥**

ఇటి వంటి వాఙ్మనోతీతమైనటు వంటి పరిపూర్ణమును యెవరూ యెరుగరు. అన్ని సిద్ధాంతములకు అతీతము.

17. గురుతు వున్నంత సేపుకలే. పోతూ వున్న సమయమే జాగ్రత. ఆపైన యేమనటానకు యేమీ లేదు. గురుకృప లేకుంటే శఖ్యం కాదు. యెరుక వుండగా సర్వ భ్రాంతులు వచ్చినవి. ఈ భ్రాంతులు వున్నంతసేపు యెరుక పోదు. దేహము రాగానే రోగము వచ్చినది. రోగము పోతేనే గాని దేహము పోదు. ఇంతకంటే మిక్కిలి వినవలశినది, చెప్పవలశినది, తెలియవలశినది, చూపవలశినది, బాపవలశినది, విచారించవలసినది పొందదగినది లేదు. ఇది నిరావరణ పరిపూర్ణ పరమోపదేశము తన్ను విడచియున్నది వున్నట్టు విచారించవలె. ఈలాగున విచారణ చేసే ఆ విచారణమే తాను లేననే నిశ్చయము కుదురును. ఇదే సర్వోపని షస్యారార్ధ మదితార్థమృతం.

18. గురువు చేత శిష్యుడు ప్రకాశించును. శిష్యుని చేత గురువు ప్రకాశించును. ఇద్దరి చేత బోధ ప్రకాశించును.

సర్వం

**శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు**

**అచలానంద బి. నరసింగ రావు**

**వివేకానంద కె. రామదాస్**

**నిర్మలానంద బోట్ల మోహన్ రావు.**

# అచలబోధ శిఖామణి

1. అహంకారము అనగా అహంబ్రహ్మాస్మి । అయమాత్మా బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మ । తత్వమసి వాక్యముల చేత ఆ బ్రహ్మమే నేను అయితిని ఈనేనే ఆత్మ । ఈ ఆత్మయే బ్రహ్మము । సర్వమును ఏది గుర్తెరుగుచున్నదో దానిని గుర్తెరుగుచున్నదే ప్రజ్ఞానము । అదే బ్రహ్మము ఆబ్రహ్మమేనేను అయితిని అనడమే అజ్ఞానము అటువంటి పశువులకు పశుపాశ వివర్తకమైనదే పరిపూర్ణ బోధ

2. చలించని వస్తువుని చూపించునది గనుకు అచలబోధ

3. ఈ బోధ ఆసక్తి గలవానికి, పరిపక్వ చిత్తము గలవారికి చెప్పవలిసినదేగాని అందరికీ చెప్పగూడదు.

4. ఎరుక ఎటువంటిది అనగా, పంచభూతములకు సాక్షియై పరమాత్మ స్వరూపమైనది. ఆ పంచకోశములకు సాక్షియై ప్రత్మగాత్మ రూపమైనది.

5. కోశభూతపుంజమైన దేహము వేరనియు । దేహాదిష్టానమైన ఎరుక వేరనియు అద్వైత సిద్ధాంతము అనగా దృక్కు బ్రహ్మ మనియు । దృశ్యము మాయయని.

   శ్రీ శివరామ దీక్షితుల వారేమన్నరనగా, దేహమునకు తనకు వేరైతే తానే భోజనము చేయవలెగాని దేహము ఎందుకు చేయవలెను. తానే సమస్త కర్మములు జరుపవలెగాని, దేహేంద్రియములు ఏల చేయవలెను.

## బోధోపదేశము - విచారణక్రమము

మొదట స్థూలప్రపంచమును చూచి, ఈ స్థూల ప్రపంచమునకు ఆధారమైనది దేహమని, ఈ రెండు ఒక్కటి అని తెలిసికొని । స్థూలదేహమునకు ప్రాణము ఆధారమని । స్థూలదేహము లేకపోతే ప్రాణం లేదని ఈ రెండు ఒకటిగా తెలిసికొని । ఈ ప్రాణమునకు ఆధారము మనస్సుగదా అని తెలిసి । ఆ మనస్సును ప్రకాశింపజేయునది నేను అని తెలుసుకొని, నా యందే సమస్త భ్రమలు, విద్యావిద్యలు, జీవేశ్వరులు, ఈ సర్వప్రపంచము, నా యందే తోచినదని । నేను లేనప్పుడు ఏమి లేదని, సర్వభ్రమలు నాకే తోచునని, నేను సర్వదా అభావమని విచారించితే, ఎరుకే లేదని । ఈ తెలివికే తెలియును. ఇదే జ్ఞానము. బ్రహ్మము కంటే మాయ బ్రహ్మాండ మందే లేదు. గురువాక్యము చేత మేల్కొని చూచితే చూసేదే లేదు.

### పిండాండ మందు విచారణ చేయుట

మొదలు స్థూలదేహమును చూడవలెను. స్థూలదేహమును చూచినది కన్నులు కదాయని విచారించి, ఆ కన్నులను చూచునది మనస్సుకదా ! యని విచారించి, ఆ మనస్సే నేను అని తెలిసి యాలాగున విచారించితే । బుద్ధియని ఆ బుద్ధియే ఎరుక యని తెలిసి, ఆ ఎరుకయే తానని నిశ్చయించుకుని । ఆ ఎరుకె దేహేంద్రియములు, అంతఃకరణ పంచకము, ప్రాణపంచకము మొదలగు నన్నిటిని యెరిగి, నేతినేతి మహావాక్యముల వలన ఈ తెలిసిన తెలివిని విడనాడి, బాహ్యా మందును అంతరమందును నిండి నిబిడీకృతమైయున్న బయలే బ్రహ్మమని, అదే స్వతఃసిద్ధమని, ఆత్మ ఏకాల మందునూ, అభావమని, మాయను మాయచేత మాయచేసి ఉన్నదానియందు లేని సమస్త జంతు సంఘాతము మొదలైన బ్రహ్మాండములను చూచి లేని ఎరుక వున్న ద్వాదశాక్షరీ పరమాత్మను చూచి, ద్వయదోషరహితమై దృక్దృశ్యములు లేక నిశ్చయ పూర్ణసమాధి చేత.

శ్లో॥ అంతఃపూర్ణం బహిపూర్ణం । మధ్యపూర్ణం నిరామయం ।
ఆద్యంత పూర్ణమచలం । సమాధితన్య లక్షణం ॥

ఈ విధముగా పరిపూర్ణమైన బయలును చూచి, తనను సర్వ శూన్యముగా చూడవలెను.

శ్లో॥ అంతఃశూన్య బహిశూన్యం । మధ్య శూన్యస బాహ్యకం ।
సర్వశూన్యం సబాహ్యేతి । సమాధిత్త స్వాలక్షణం ॥

ఈ విధముగా తనను క్రిందను, మీదను, నాల్గు మూలల దిక్కులు, మధ్యమందు పైన అంతటను తాను ఎక్కడను లేనని గ్రహించవలె.

శ్లో॥ అశరీరం సర్వదా అస్తి । శరీరం రహితం సదా ।
ఇయమేవ సద్యోముక్తి । రన్యదా భ్రమకారణం ॥

ఇదే నిశ్చయము

ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు. ఈ బయలే స్వతః సిద్ధ పరిపూర్ణము. బయలనగా పంచభూతములు గాదు. ఉపరిభూతములైన మహదాది విద్యలు గావు। మనస్సు జ్ఞానము కాదు. పంచకోశములు । పంచశక్తులు లేవు. హిరణ్యాయ కోశముగాదు. అది అదియనే అనుభవము గాదు. తత్వమస్యాది మహావాక్యములు కావు. నీవే బ్రహ్మము । బ్రహ్మమే నేనన్నట్లు కాదు. అయమాత్మా అన్నట్లు కాదు. సత్యజ్ఞాన మనంత బ్రహ్మమన్నట్లు కాదు. పరమ పద మన్నట్లు కాదు. బ్రహ్మనుభ్రమనే భ్రాంతి ఎరుకతోనే పోయెను.

**బట్టబయలయిన పరశివతత్వమే । పరిపూర్ణతత్వము**

సేకరణ
పిన్నంశెట్టి కిషన్
హైదరాబాదు.

# అచల తత్వ శిరోమణి అఖండమాల

## తత్వం

యేదిరా యిక జనన మరణామూ గురుకీలు దెలశితె । రాదురా యిక నెపుడు జన్మామూ ॥ ప ॥
యేదిరా యిక జనన మరణము వాద భేదము లంటబోకను ।
పాదుకొల్పియు హృదయమందున పాద ద్వంద్వము జేర్చువారికి ॥ యేది ॥ 1 ॥
నెమ్మదిగ శ్రీగురుని వాక్యము యి మ్మహితొ నెరిగుందు నృతతికి ।
కమ్ముకొని బ్రహ్మాండమంతట కదలకున్నది అచల మెప్పుడు ॥ యేది ॥ 2 ॥
లక్ష్య లక్ష్యము గానిదీ నిర్లక్ష్యమై యడతెగక నున్నది ।
పక్షపాతము లేకనెప్పుడు పల్కులంటక మెదలకున్నది ॥ యేది ॥ 3 ॥
ద్వాదశియు షోడశియు మంత్ర ద్వయము నెరిగిన వారికెప్పుడు ।
బాధలన్నది లేక నిరతము భేదమోదము లేక నున్నది ॥ యేది ॥4॥
భాగవత శ్రీకృష్ణ యోగియు బాగుగా వినులక్ష్మణాఖ్యుని ।
వేగమే వినుపించి నట్టిది రాగ ద్వేషము లేనిదచలము ॥ యేది ॥ 5 ॥

# ఓం

# శ్రీ మత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక ప్రభు మందిర కార్యవర్గకమిటీ వివరాలు

## నెం. 11-1-140, సీతాఫల్ మండి, సికింద్రాబాద్, ఆం.ప్ర - 500061

| క్రసం | సంవత్సరము | అధ్యక్షులు | ప్రధాన కార్యదర్శి |
|---|---|---|---|
| 01 | 1935 నుండి 1949 | శ్రీ అ॥ప॥ మోటుకారు తిప్పన్న పటేలు గారు | శ్రీ అ॥ప॥ బంగ్లా బాలయ్య గారు |
| 02 | 1949 నుండి 1952 | శ్రీ అ॥ప॥ బంగ్లా బాలయ్య గారు | శ్రీ అ॥ప॥ కుచ్చుల వెంకటస్వామి నాయుడు గారు |
| 03 | 1952 నుండి 1960 | శ్రీ అ॥ప॥ పసుపులేటి రామస్వామి నాయుడు గారు | శ్రీ అ॥ప॥ కుచ్చుల వెంకటస్వామి నాయుడు గారు |
| 04 | 1960 నుండి 1973 | శ్రీ అ॥ప॥ పూర్ణానంద అరిగె రామస్వామి గారు | శ్రీ అ॥ప॥ గురుకరుణానంద గుండా ఈశ్వరయ్య గారు |
| 05 | 1973 నుండి 1984 | శ్రీ అ॥ప॥ గురుకరుణానంద గుండా ఈశ్వరయ్య గారు | శ్రీ అ॥ప॥ నిత్య నిర్గుణానంద కొండోజు బ్రహ్మానందం గారు |
| 06 | 1984 నుండి 1990 | శ్రీ అ॥ప॥ నిర్మలానంద జొన్నాడ బాలయ్య గారు | శ్రీ అ॥ప॥ నిత్య నిర్గుణానంద కొండోజు బ్రహ్మానందం గారు |
| 07 | 1990 నుండి 1994 | శ్రీ అ॥ప॥ అమలానంద వీసంశెట్టి అయోధ్య రాములు గారు | శ్రీ అ॥ప॥ నిర్మలానంద కాడిగె నారయణ గారు |
| 08 | 1994 నుండి 1998 | శ్రీ అ॥ప॥ దయానంద సావంత్ సీతారామరావు గారు | శ్రీ అ॥ప॥ నిర్మలానంద కొంపల్లి యాదగిరి గారు |
| 09 | 1998 నుండి 2004 | శ్రీ అ॥ప॥ సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి గారు | శ్రీ అ॥ప॥ దాసానంద కొండోజు నిత్యానందం గారు |
| | | నోట్ : మందిర పునఃనిర్మాణం తేది: 11-02-2004న ప్రారంభం అయ్యి తేది: 22-11-2004న పూర్తి అయ్యింది | |
| 10 | 2004 నుండి 2009 | శ్రీ అ॥ప॥ సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి గారు | శ్రీ అ॥ప॥ దాసానంద కొండోజు నిత్యానందం గారు |
| 11 | 2009 నుండి ఇప్పటివరకు | శ్రీ అ॥ప॥ సమిష్టి బోధానంద ఉప్పలంచి క్రిష్ణమూర్తి గారు | శ్రీ అ॥ప॥ దయానంద సావంత్ సీతారామరావు గారు |

# అఖండ గురుపాదుకా పూజ ఆరాధన

ప్రతి నెల 2 వ శనివారం సా॥ 6-00 గం॥లకు జరుపబడును














## శ్రీమత్ ఫీల్ఖాన లక్ష్మణ దేశిక అచలగురు మందిరం

సీతాఫల్‌మండి, సికింద్రాబాద్

Website : www.feelkhanalaxmanaguru.com

శ్రీ దక్షిణామూర్తి పరబ్రహ్మమౌనసాంజ్ఞ



నిర్మలమేతదా, జ్ఞానశ్చరీరం, నాస్తికేవలం

శ్రీ దక్షిణామూర్తి శిష్యులు




శ్రీ మన్నారాయణమూర్తి (మహావిష్ణువు)

శ్రీ మహావిష్ణు ప్రియశిష్యులు



శ్రీ సూర్యుడు (సూర్యబింబ మహారాజు)

శ్రీ యాజ్ఞవల్క్యమహర్షి




శ్రీ జనకమహారాజుకు బ్రహ్మోపదేశముచేయుట

శ్రీ జనకమహారాజు




శ్రీ జనక రాజర్షి శ్రీ శుక మహర్షికి బ్రహ్మోపదేశముచేయుట

శ్రీ జనక రాజర్షి శిష్యులు శ్రీ శుక మహర్షి




శ్రీ పరీక్షిత్తు మహారాజుకు బ్రహ్మోపదేశముచేయుట

## శ్రీ సాందీపమహర్షి




శ్రీకృష్ణమూర్తికి పరిపూర్ణవిద్యలు సూచించుట

## శ్రీ కృష్ణపరబ్రహ్మ




శ్రీ ఉద్ధవులకు గురుసూచన ఆశీర్వచనము

## శ్రీ సాందీపమహర్షి శిష్యురాలు




మాతా రుక్మిణీ దేవి




శ్రీమదచల ఋషి మహాయోగి వేమనార్యులు

## అచలగురువు




శ్రీ శ్రీధర స్వాముల వారు

## అచలగురు శ్రీశ్రీశ్రీ ధర స్వాముల వారి ప్రియ శిష్యులు




శ్రీ ముద్దాముదుగు శ్రీ శివరాము దీక్షితులవారు

శ్రీ శ్రీధరస్వామి




శ్రీ శ్రీధరస్వామి






శ్రీ శ్రీధరస్వామి సమాధి కుంభార్‌ఘాట్




శ్రీ రంగనాధ స్వామి

# శ్రీ మద్భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభువులవారి ప్రియ-శిష్యులు



శ్రీ మదాదిరాజ తిరుమలరాయులు బొల్లారం-సికింద్రాబాద్



శ్రీ సాధురామ్ బహద్దూర్ విశాఖపట్నం





శ్రీ మత్ ఫీల్ఖాన లక్ష్మణ ప్రభు-శిష్యులు
శ్రీ మంగోలు వెంకటనర్సయాచారి భాగ్ అంబర్‌పేట్



శ్రీ మత్ ఫీల్ఖాన లక్ష్మణ ప్రభు-శిష్యులు
శ్రీ నిమిశకవి కూనపులి రాజారాం సూర్యాపేట్

